## *Point of clarification regarding press report on the statement made by the Revenue Minister on the Andhra Pradesh ceiling on Agricultural holdings. Bill, 1958*

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, మీముందు ఒక్క విషయము విశదీకరించ దలచుకున్నాను ఈ దినము ఉదయము, నిన్న సాయంత్రము వచ్చిన News Papers చూచాను వాటిలో నేను ఇక్కడ బిల్లును గురించి ఇచ్చిన reply తప్పుగా ప్రచురించబడింది పైగా paper లో ఆ విషయము పెద్ద heading క్రింద చూపించి ప్రచురించారు ఏమని అంటే, sugar factory కు సంబంధించిన clause ను తీసివేయటానికి ప్రభుత్వం సిద్ధముగా ఉన్నట్లుగా వ్రాశారు. నేను అలాంటి విషయము నా జవాబులో ఎక్కడనూ చెప్పలేదు అలాంటి సూచన అయినా చేయలేదు ప్రభుత్వంకూడ అలాంటి నిర్ణయము తీసుకొననే లేదు. నేను విమర్శకులకు చెప్పిన సమాధానము ఏమిటంటే, ఆ క్లాజులో 1—10—1950 అని తేది ఉన్నది అది కాదు ఆ నేటటువంటి వారు అవును అని చెప్పే విమర్శకులకు ఇది సహేతుకమే నని Select Committee వారు భావించినపుడు ఆ తారీఖు తీసివేయ వచ్చునని నేను చెప్పాను Next step ను గురించి నేను చెప్పాను కాని, అక్కడ కూడ sugar factory కి సంబంధించిన exemption clause ను తీసివేయటానికి ప్రభుత్వం సిద్ధముగా ఉన్నదని నేను చెప్పలేదు Press వారు దానిని ఏ విధముగ అర్థము చేసుకున్నారో గాని, ఈ విధముగ చెప్పనిది చెప్పినట్లుగా బహిరంగముగ పేపర్లలో రావడము ద్వారా ప్రచారము కావడమువల్ల, నేను ఈ రోజున మీ ద్వారా తెలియజేయవలసి వచ్చింది గనుక చెబుతున్నాను.

*Mr Speaker* Press people will please note

శ్రీ కె. వెంకటరావు · ఇప్పుడు నేను కోరేది ఏమిటంటే, ఇప్పుడు దానిని మరల మార్చుతూ equally good publication గా statement కు యివ్వమని నేను కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ Sugar factory లను గురించిన ఆ తారీఖును తీసివేస్తే అన్ని sugar factories కు కూడ exemption అనేది పోతుందని మంత్రిగారు చెబుతున్నారు

శ్రీ కె· వెంకటరావు. తారీఖును తీసివేయటానికి నిర్ణయము జరిగి ఉంటే 'If' అని ఉన్నది కాని 'But' అని లేదు ఇది ముందు select committee వారు చూడాలి మరల ఈ సభవారు కూడ చూడాలి.

శ్రీ పి. సుందరయ్య: అధ్యక్షా, ఇప్పుడు రెవిన్యూమంత్రిగారు చెప్పిన దానినిబట్టి నేను అర్థం చేసుకోగలిగింది ఏమిటంటే 1—10—1950 వ తేది లోపల రిజిస్టరు అయిన Sugar Factories కు తప్ప ఆ తేదీ తరువాత రిజిస్టరు అయి Sugar Factories కు exemption లేదు గనుక వాటికికూడ మినహాయింపు యివ్వాలని అంటున్నారని అనుకుంటున్నాను. కాబట్టి ఇప్పుడు ఆ 1—10—1950 వ తేదిని తీసివేస్తే, ఆ తేది తరువాత రిజిస్టరు అయినవికూడ మినహాయింపు చేయబడుతాయి అన్నమాట అదేనా మంత్రిగారి యొక్క అభిప్రాయము?

శ్రీ కె. వెంకటరావు: అదికాదండి ఆ తేదీకి దరిమిలావచ్చినవికావు ముంగు ఉన్నవికావు నేను చెప్పిన దానికి just the opposite సుందరయ్యగారు అర్థము చేసుకుంటున్నారు మరల ఒకసారి ఆ క్లాజును చదువుకుంటే అర్థమవుతుంది. ఇప్పుడు ఆ 1-10-1950 తేది తీసివేశామనుకోండి అలాంటప్పుడు ఏ Sugar Factory కికూడ exemption ఉండదు అన్నమాట అంటే దీనినిగురించి informalగా చెబుతున్నాను. ఇప్పుడు బోధన్ చక్కెర ఫ్యాక్టరీ ఒక్కటే exemption క్రిందకు వస్తుందని అనుకుంటున్నాము. 1—10—1950 అనేది తీసివేస్తే, ఆ exemption ఆ బోధన్ షుగర్ ఫ్యాక్టరీకికూడ పోతుంది. అలాంటప్పుడు అన్ని ఫ్యాక్టరీలను సమానముగా ప్రభుత్వం చూస్తుందన్నమాట ఈ protection ఒకదానికి ఇచ్చి, యింకొకదానికి ఇవ్వకుండా ఉండడమనేది ఏమీలేదు మొత్తముమీద ఏ factory కి కూడ protection అనేది ఉండదు అని నేను చెప్పాను.

శ్రీ పి. సుందరయ్య: పత్రికలవారు publish చేయటానికైనా Select Committee వారు అంగీకరిస్తే, అప్పుడు అన్నింటికీకూడ ఒకేవిధముగ చూస్తాము అనే కదా! "సెలెక్టుకమిటీవారు అంగీకరిస్తే" అనుపదము చేర్చక పోవడము వల్లనేనా, పబ్లికేషన్ లో ఉన్న పొరబాటు?

మిస్టర్ స్పీకర్: Select Committee వారు అంగీకరిస్తే అన్నికూడ ఒకే విధముగ చూస్తాము అంటే, అన్నింటికీకూడ exemption తీసివేస్తాము అని కూడ మంత్రిగారు చెబుతున్నారు

శ్రీ కె. వెంకటరావు: Let the stress be noted Exemption ఇవ్వడమా, అక్కరలేదా అనేదే ప్రశ్న. Act లోని Section లో ఉన్నది ఏమిటంటే 1—10—1950 తేదికి పూర్వము ఏ Sugar Factory కి అయినా స్వంతముగా భూమి ఉంటే దానికి యీ కీలింగు apply కాదు. అంటే ఆ తేదికి దరిమిలాన వచ్చిన Factories భూములను కొనుక్కుంటే వాటికి ceiling ఉంటుందని అర్థము.

ఇప్పుడు ఆ 1—10—1950 తేదికూడ తీసివేస్తే, ఆ తేదికి పూర్వము ఉన్న factories కు ఉండే భూములకుకూడ సీలింగు ఉంటుందని అర్థము

మిస్టర్ స్పీకర్ Production విషయమేమిటి?

శ్రీ కె వెంకటరావు Production అనేది తరువాత విషయము దాని consequences తరువాత చూడాలి ఇప్పుడు ఆ తేది ఈక్లాజులో ఉంచాలా లేక తీసి వేయాలా అనే విషయము ఇంకను చర్చలలోనే ఉన్నది దానినిగురించి ఏమీ నిర్ణయము జరగలేదు 1—10—1950 వ తేది తీసివేయడమువల్ల ఆ తేదికి తరువాత వచ్చిన factories కు exemption ఉండదు ఆ తేదిని అక్కడ ఉంచడమువల్ల ఒక దానికి exemption వస్తుంది ఇంకొకదానికి రాదు అన్ని factories ని కూడ సమానముగ చూడాలని Select Committee వారికి చెప్పాను ఆభావము గనుక సెలెక్టు కమిటీవారిలో prevail అయితే, అప్పుడు అదికూడ సీలింగు క్రిందకు తీసుకునిరావాలి

మిస్టర్ స్పీకర్ 'సెలెక్టు కమిటీ వారికి ఇష్టమైతే'—అంతేనా?

శ్రీ కె వెంకటరావు అంతే

డాక్టర్ ఎం చెన్నారెడ్డి (వికారాబాద్-జనరల్) Exemption కావాలని అంటున్నప్పుడు, 1—10—1950 కు పూర్వం వున్న factories కు కూడ exemption లేకుండా చేయటానికి యాక్టును apply చేస్తారు అనిఅంటే, దానిఅర్థము ఆ తేదికి తరువాత వచ్చిన factories కు కూడ exemption ఇవ్వటానికి ప్రభుత్వానికి ఆలోచన లేదని మంత్రిగారి అభిప్రాయమేమోనని నేను అనుకుంటాను

మిస్టర్ స్పీకర్ 1—10—1950 తేదికి పూర్వము ఉన్న వాటికి exemption ఉంటుందని, తరువాత వచ్చిన వాటికి లేదని

శ్రీ కె. వెంకటరావు అసలు ప్రభుత్వానికే ఉన్న అభిప్రాయము "No exemption" అని కాని 1—10—1950 కు పూర్వము ఉన్న వాటికే యీ concession వుంటుందని యిప్పుడువున్న బిల్లులో ఉన్నది ఇప్పుడు అదికూడ ఉండకూడదని అన్ని factories ను ఒకేవిధముగ చూడాలని, ఆ తేదిని తీసివేయాలని ఉద్దేశ్యము బోధన్ factory ని ఒక విధముగాను, తక్కిన factories ను యింకొక విధముగాను చూడకూడదని సెలెక్టుకమిటీలో వాదన జరిగింది. కాని నేను మాత్రం అన్నిటిని ఒకే విధముగ చూడాలని, బోధన్ ఫ్యాక్టరీ విషయముకూడ ఆలోచించవలసినదని నేను అన్నాను ఇంత clear గా నేను చెప్పాను.

## *Business of the House.*

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) నేను ఒక బిల్లును పంపించాను దాని విషయములో ఏమి అయిందో తెలియదు.

మిస్టర్ స్పీకర్. ఆ బిల్లును గురించి నేనే చెబుతాను వినండి గోపాల కృష్ణయ్యగారు Official Language తెలుగులో ఉండాలని ఒక Non-Official Bill ను పంపించారు కాని ఆబిల్లు విషయములో నాకు ఒక సందేహము వచ్చింది Official Language తెలుగుగా ఉండాలని, అది అమలులో పెట్టాలని అంటే ప్రభుత్వానికి ఇప్పటికంటే ఎక్కువ ఖర్చు అవుతుంది Typewriters వగైరాలు కావాలి ఎంతో ఖర్చు ఎన్నో విధాలుగా ఉంటుంది కాబట్టి ప్రభుత్వముయొక్క financial position effect అవుతుందేమోనన్న అనుమానము నాకు కలిగింది. ఎక్కువ ఖర్చు అవుతుందని నేను వద్దని చెప్పడములేదు ఖర్చు అయితే కావచ్చును. కాని ఇది Money కి సంబంధించిన బిల్లు గనుక, దీనికి గవర్నరుగారి పర్మిషనుకొరకు పంపవలసి వస్తుందేమోనని అనుమానము కలిగింది కాబట్టి ఆబిల్లును గవర్నరుకు పంపిస్తే, ఆ విషయము వారే ఆలోచిస్తారు Permission అవసరము అని వారికి తోస్తే, Permission ఇస్తారు ఆ ఉద్దేశ్యముతోనే, ఈ బిల్లుకు మీ పర్మిషను అవసరమా, లేదా, అక్కరలేదు అంటే, ఇక్కడ నేను పర్మిషను ఇస్తాను, లేదా మీ పర్మిషను అవసరమని తోస్తే, Permission ఇవ్వండి కాబట్టి యీ విషయమును గురించి మీరే ఆలోచించండి" అని గవర్నరుగారికి వ్రాశాము. Permission ఇవ్వను అని గవర్నరుగారు చెబితే, సరె అది వారి ఇష్టం అంతేకాని ఆ బిల్లు ముందుగా నావద్దకు రావడము, వానికి Permission అవసరమా, లేదా అని మనము పరిశీలించడము, త్రిప్పి పంపడము ఇది అంతా అక్కరలేకుండా ఒకేసారి గవర్నరుకు పంపుతూ వ్రాశాను వారు Permission ఇస్తే, మాకేమీ అభ్యంతరములేదు. కాబట్టి యిప్పుడు ఆబిల్లు ఈ Session లో రాదు వచ్చే సమావేశములో మార్చుకోవచ్చును

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య. అధ్యక్షా, ఇలాంటి బిల్లును introduce చేసే విషయమును గురించి ఒక్క విషయము మీ దృష్టికి తేదలచుకున్నాను ఇది వరకు ఇలాంటి బిల్లును ఇక్కడ introduce చేయటానికి ఇదేమాదిరి సమస్య వచ్చింది అప్పుడు గవర్నరుగారికి Permission కొరకు వ్రాశాము అలాంటివి మూడు బిల్లులు పంపించాము వాటిమీద ఒక్కొక్కదాని విషయములో గవర్నరుగారు వ్రాసింది చదువుతాను

మిస్టర్ స్పీకర్. అందులో ఇలాంటి విషయమే ఉన్నదా?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ఇలాంటిదేనండి అదికూడ 'Money Bill' అవుతుంది

మిస్టర్ స్పీకర్ 'Money Bill' అని అంటే కాదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య Money Bill కావచ్చు ప్రభుత్వం యొక్క expenditure affect అయేటటువంటి బిల్లు అందులో ప్రభుత్వం వ్రాసిపంపించినదిచదువుతున్నాను వినండి. త్రివేదిగారు గవర్నరుగా ఉన్నప్పుడు 12-9-1955 తేదీన వచ్చింది "As regards the Andhra Agrarian Bill 1955, I am to inform you that Government have advised that the Bill requires the recommendation of the Governor under Art 207(3) of the constitution only for its consideration and not for its introduction కాబట్టి introduction stage లో మాత్రము గవర్నరుగారి permission అక్కరలేదని, అది ఒకవేళ Money Bill అయినట్లైతే consideration stage లో మాత్రము మా యొక్క అనుమతి కావలసి ఉంటుంది అని అందులో ఉదహరించారు. అట్లాగే ఇంకొకటి ఉన్నది. ఏమని అంటే,—

"As regards the Andhra Land Revenue Revision Bill 1955 I am to inform you that the Governor, on the advice of the Government, has decided to withhold his recommendation under Art 207 of the constitution, the introduction of the Bill, because it is touching the Taxation itself ఆ తరువాత ఇంకొకటి కూడ వచ్చింది. దానిలో "With reference to your letter cited above, I am directed to inform you that Government have held that he Andhra Moratorium Bill 1955 given notice of, does not require the recommendation of the Governor under Art 207 of the constitution" అని యీ విధముగా మూడింటి విషయములోనూ మూడు విధములుగా వ్రాసి పంపించారు. అంటే ఈ Andhra Agrarian Bill Money Bill అవుతుంది గనుక వ్రాశారు అంతకుముందుకూడ ఇది ఒకసారి వచ్చింది. దానిమీద వ్రాస్తే, introduction stage లో మాత్రము గవర్నరుగారి permission అక్కరలేదని అన్నారు. ఎందుకంటే Andhra Agrarian Bill ఒకసారి publish అయింది. Introduce

చెయడముకూడ జరిగింది ఆ తరువాత ఆ గవర్నమెంటు పోయింది మరల ఎన్నికలు జరిగిన తిరువాత క్రొత్త అసెంబ్లీ form అయింది అందువల్ల మరల గవర్నమెంటుకు వ్రాశారు వ్రాస్తే ఇచ్చిన జవాబు ఏమిటంటే, "దీనికి introduction stage లో గవర్నరుగారి పర్మిషను అక్కరలేదు consideration stage లో మాత్రము గవర్నరు పర్మిషను కావాలని అన్నారు అందువల్ల ఇదికూడ అలాంటి బిల్లే గనుక, గవర్నర consideration stage లో మాత్రమే దీనికి గవర్నరుగారి పర్మిషను కావలసివస్తుందేమో కాని, introduction stage లో అక్కరలేదని గవర్నరుగారు వ్రాసిన ఉత్తరములోనే ఉన్నది. కాబట్టి ఈ విషయముకూడ ఆలోచించమని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ అయితే ఇదివరకు ఒకసారి ఇది reject చేయబడిందిటగదా అయితే దానిని మరల introduce చేయటానికి ఎంత టైము కావాలి అనే విషయము కూడ ఒకటి ఉన్నది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ఈ ఒక్కవిషయమునే మీ దృష్టికి తీసుకుని రావలసి వస్తున్నది ఎందుకంటే, introduction stage లో వారియొక్క Permission అక్కరలేదని మీకు తెలియజేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ - 151 వ రూలు క్రింద అదికూడ ఒకటిఉన్నది. The safest thing is, let us have it in the next Assembly Session

(శ్రీ) వావిలాల గోపాల కృష్ణయ్య : అదిసరే, మీయొక్క రూలింగును నేను question చేయడములేదు Introduction stage లో గవర్నరు permission అక్కరలేదని గవర్నరుగారే చెప్పారని మీ దృష్టికి తెస్తున్నాను

మిస్టర్ స్పీకర్ . All right, I am glad you have told me about it now. మరొక విషయముకూడ చెబుతాను 151వ రూలును చదువుకోండి దానిలో "When a Bill is rejected by the Assembly a Bill relating to the same subject-matter shall not be introduced or moved within a period of six months from the date of its rejection" అని ఉన్నది ఇప్పుడు ఆ ఆరు నెలల period కూడ ఈ రోజుతోనే పూర్తి అవుతున్నదని అంటున్నారు. కాబట్టి

దీనిని గురించి వచ్చే సమావేశములో చూడడము మంచిది కాని అప్పుడు introduce చేయనివ్వండి అని అంటే, నాముల్లె ఏమిపోయింది? అప్పుడు గవర్నరుగారు ఆపో దిస్తారో, ఏమి చెస్తారో తెలియదు వారు మహానుభావులు వారు ఏమిచెస్తారో ఎవరికి తెలుసు? దానికి ఎవరు ఏమి చేయగలరు?

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, వచ్చే సెషన్‌లోనే రావచ్చుననుకోండి ఇక్కడ ప్రిన్సిపుల్ ఒకటి involve అయినది మనీబిల్స్, ఫైనాన్స్‌బిల్స్ అయినప్పుడు మాత్రము గవర్నరుయొక్క పర్మిషన్ లేనిదే introduce చేసే దానికి కూడ వీలులేదనేది జనరల్‌గా ఢిల్లీలో ఉన్నటువంటి పార్లమెంటరీ సాంప్రదాయము ఇతర రకాల బిల్లులకు బిల్లు ప్యాస్ అయిన తరువాత అమలు జరిపేటప్పుడు వచ్చేటటువంటి financial liability కొరకు consideration stage లో గవర్నరు యొక్క పర్మిషన్ కావలసి ఉంటుంది గాని introduction stage లో—అది మనీబిల్, ఫైనాన్స్ బిల్ కాదు కనుక—అది పూర్తిగా స్పీకరుగారి చేతులలో ఉన్నది ప్రతి బిల్లును వ్యతిరేకించినట్లుగానే ప్రభుత్వం దీనిని కూడ వ్యతిరేకించవచ్చుననుకోండి, అది వేరే సంగతి కనీసం ఓటింగ్ అయినా జరగవచ్చు ఇటువంటి బిల్లులలో గవర్నరుగారి ప్రశక్తే రాదు ఫైనాన్స్ బిల్సు, మనీబిల్స్ వచ్చినప్పుడు గవర్నరుయొక్క పర్మిషన్ 'even for introduction కు కూడ కావలసి ఉంటుంది మిగిలిన బిల్స్‌కు గవర్నరు దగ్గరకు పోవలసిన అవసరమే లేదు consideration stage కి వచ్చినప్పుడు financial commitment ఉన్నది కాబట్టి గవర్నరుయొక్క అనుమతి,—ప్రభుత్వంయొక్క అనుమతే అనుకోండి—కావలసి ఉంటుంది ప్రభుత్వం ఏది అనుమతించదు ఇప్పుడు త్రోసివేసేది అప్పుడే త్రోసివేయవచ్చు, ఇటువంటి బిల్లులను గవర్నరు దగ్గరకు పంపించినట్లయితే మన హక్కును గవర్నరుకు అనవసరంగా యివ్వడం అవుతుంది.

## NON-OFFICIAL BUSINESS

### *Resolution re Formation of Tappers' Co-operative Societies in Telangana*

**lost**

*Sri B Dharm Bhiksham*(Nakrakal) Sir, I beg to move .

" This Assembly recommends to the Government to discontinue the present system of giving excise contracts by auction and instead

to form Tappers' Co-operative Societies in Telangana, and entrust the said work to the Societies. "

*Mr Speaker* Motion moved

( *Sri P.V. Narsimharao* in the Chair )

శ్రీ బి ధర్మభిక్షం: అధ్యక్షా, తెలంగాణాలోని షుమారు 12లక్షల గీత కార్మికులకు సంబంధించిన చాలా ముఖ్యమైనటువంటి తీర్మానం ఇది జనాభాలో చాలా ఎక్కువమందికి యిది వృత్తిగా ఉన్నది Financial గా చూచినప్పటికి మన రాష్ట్రానికి పెద్ద మొత్తం ఈ Excise Department నుంచే లభిస్తున్నది ఈ వృత్తి నుండి రాబట్టుకొనే దానిలో ప్రభుత్వం ఒకరకంగా నిర్లక్ష్యం చేస్తున్నదనే చెప్పాలి. కొంతమంది Contractors యొక్క ప్రయోజనాల కొరకు ప్రభుత్వం ఒకరకంగా సహాయపడడంవల్ల తాను రాబట్టుకొనుటలో విఫలత చెందినదని నేను చెప్పదలచాను. చాలామంది Contractors కొన్ని లక్షల రూపాయలు ప్రభుత్వానికి బాకీ ఉన్నారు ఇదివరకు Hyderabad Assembly ఉన్నప్పుడు ఈ లెక్కలన్ని తెప్పించి పెట్టాను అవన్నీ ఇప్పుడు మీ ముందు పెట్టదలిస్తే చాలాసమయం పోతుందనే ఉద్దేశ్యంతో నేను పెట్టుటకు సిద్ధపడడం లేదు. హైదరాబాద్, సికింద్రాబాద్ నగరాలలోనే బన్ కట్ లాల్ బద్రువే రెండు లక్షల రూపాయలు బాకీ ఉన్నాడు. అదే విధంగా బాపయ్య ఒక లక్షకుపైగా బాకీ ఉన్నాడు అదే విధంగా డి డి ఇటాలియా 88 వేల రూపాయలు హైదరాబాద్, సికింద్రాబాద్ దుకాణాల బాపతే బకాయి ఉన్నాడు వీళ్లు మొత్తం జిల్లాలో పెద్ద Contractors గా ఉన్నారు. వీళ్ల బకాయిలు వసూలుచేసేందుకు ఏమాత్రం శ్రద్ధచూపక పేద గీతపారిశ్రామికుల యిళ్లను జప్తు చేసేటందుకు, వాళ్లను వృత్తులనుండి తొలగించేటందుకు ప్రభుత్వం నిర్దాక్షిణ్యముగా ప్రయత్నం చేస్తూ ఉండడం మనం గ్రామాలలో చూస్తున్నాం ఎన్నో సంఘటనలు యిదివరకు Hyderabad Assembly లోను, ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత ఈ అసెంబ్లీలోను కూడ చెప్పడం జరిగింది. బకాయిల మాఫీలనే పేరుతో పెద్ద Contractors కో, మంత్రుల యిళ్లకు పోయి అన్ని రకాల influence చేయగలిగిన వాళ్లకే మాఫీలు తప్ప, పల్లెలలో ఉండే గీతపారిశ్రామికుల బకాయిలను మాత్రం మాఫీ చేసేందుకు ప్రభుత్వం సిద్ధపడడంలేదు ఇంకా కావాలంటే ప్రభుత్వం ఒక Enquiry Committee ని వేసి బకాయిల మాఫీలు ఎవరికి జరుగుతున్నాయో తెలుసుకుంటే మంత్రిగారికే స్పష్టం అవుతుందని మీద్వారా తెలియ జేస్తున్నాను. ఇదంతా ఒక తతంగంలాగా కనబడుతున్నది ఇది ఒకనాటిదికాదు చాలాకాలంనుంచి సాగుతున్న నాటకం అని నేను చెప్పదలచాను Financialగా ప్రభుత్వానికి ఏ విధంగా నష్టం వస్తున్నది, గీత పారిశ్రామికులను దోచుకునేటందుకు ఏ రకంగా అవకాశం

కలుగుతున్నది, 2, 3 points ద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకురాదలచాను ఇదివరకు Hyderabad రాష్ట్ర ఆదాయం 11 కోట్లు అందులో 8, 9 కోట్లు Excise Department నుంచే వస్తుంది ఈ 8, 9 కోట్ల ఆదాయంలో 3, 4 కోట్ల రూపాయలు ఎప్పుడూ బకాయిలే ఉంటాయి ఈ 3, 4 కోట్ల రూపాయిల బకాయిలు ఎవరివయ్యా అంటే యిందాక నేను వరుసగా మాపించిన పెద్దలవే సామాన్యంగా గీత పారిశ్రామికులు బకాయిలు పెట్టరు పెడితే చెట్లదగ్గరకు పోనియ్యరు పోనియ్యకపోతే చెట్లు పోతాయనే భయంతో ఏదో తంటాలు పడి తీసుకొచ్చి కొల్లిస్తారు బిలాయ్ నంబర్ల పేరుమీద పెనాల్టీలు వేస్తారు నంబర్లులేకుండా గీశారని ప్రభుత్వం పెనాల్టీలు వేసిన లెక్కలు ఒకసారి మీదృష్టికి తెస్తాను 1950 లో Hyderabad రాష్ట్రంలో మొత్తం 21లక్షల చెట్లు allot చేయబడినాయని ప్రభుత్వలెక్కలు బిలాయ్ నంబర్లకు సంబంధించిన తాడి, ఈత చెట్లు 25 లక్షలు 21 లక్షలలో పంచనామా చేయబడిన చెట్లు 5 లక్షలు మాత్రమే. ఆ చెట్లమీద పెనాల్టీలు వేసినది 9 లక్షల రూపాయలు కాని వసూలు చేసిన డబ్బు 52 వేల రూపాయలు మాత్రమే అంతవరకే ప్రభుత్వము వసూలు చెయగలిగింది అంటే బిలాయ్ నంబర్లు అనేది బూటకం. పెనాల్టీలు అనేది బూటకం, వసూలు చేయడంకూడా బూటకమేనని తేలుతోంది గమళ్లవారి నుంచి వసూలు చేయడంలో చెట్లు ఏమైనా వదలిపెట్టారా అంటే ఒక చెట్టుకూడా వదలిపెట్టకుండా ప్రభుత్వం లెక్కకడుతున్నది అట్లా లెక్క కడుతున్నదని ముస్తాదర్ మీదకనుక షికాయత్ చేశారంటే అక్కడి Excise Sub-Inspector ఆదారువాలు వాళ్లు అంతా కలిసి ఆ కలాయ్‌ల మీద చట్టప్రకారంగా గీసేవాడు అయినప్పటికి నేరస్థుడు కాబట్టి జైలులో పెట్టాలని case నడుపుతారు ఎన్నో ఘట్టాలు ప్రభుత్వదృష్టికి తేబడినాయి పత్రికలలో ప్రకటించబడినాయి ఉదాహరణకు సూర్యాపేట తాలూకాలో వర్ధమాన పేట గ్రామంలో అట్లా వందమంది పెడితే వాళ్ళు ప్రతినెలా రెండుసార్లు లారీలు కట్టుకొని కోర్టుకు రావలసిన గతి పట్టినది అదే విధంగా సూర్యాపేటతాలూకా సరికొండ అనే గ్రామంలో మొత్తంగీయబడిన చెట్లు 803, numbered చెట్లు 291, un-numbered చెట్లు 508 ప్రభుత్వం ఆబ్కారి చట్టాన్ని మార్చి కనీసం తనకు రావలసిన డబ్బయినా ఖజానాలోనికి సరిగా వచ్చేటట్లు చూస్తూ గీత పారిశ్రామికుల యొక్క ఆర్థిక పరిస్థితిని బాగుచేసేటందుకు ఆలోచన చేస్తుందనే ఉద్దేశ్యంతో నేను ఇదంతా ప్రభుత్వం దృష్టికి తీసుక వస్తున్నాను.

చట్టమును మార్చబోతున్నామని శ్రీ వెంకటరావుగారు చెప్పినారు ఒక సబ్-కమిటీని వేశారనుకోండి. అది వేసినది వేసినట్లుగానే ఉన్నది ఆ కమిటీలో ఎక్సైజు డిపార్టుమెంటు వారిని వేశారు వారు రుచిమరిగినవారు కాబట్టి వారి రికమెండేషన్సు కూడా అట్లాగే ఉన్నాయి ఇకముందు ఏమి చట్టము తెస్తారో తెలియదు కాని, తగు విధంగా చట్టము చేయకపోతేమాత్రం చాలా ప్రమాదకరమైన పరిస్థితులు ఏర్పడతా

యని మనవి చేస్తున్నాను. ఈ విషయాల నన్నిటినీ దృష్టిలో పెట్టుకొని, చాలామంది శాసనసభ్యులు రాజకీయ విచక్షణ లేకుండా, గీతకార్మికులకు పారిశ్రామిక సంఘాలు ఏర్పరచి వారందరికీ ఎంప్లాయిమెంట్ ఇవ్వాలని ప్రభుత్వ దృష్టికి తెచ్చారు సహకార సంఘాలు అనే సూత్రానికి మాత్రం మన ప్రభుత్వం అంగీకరించింది తక్కిన విషయాలను మాత్రం అమలులో పెట్టడానికి సిద్ధంగా లేదు ఇది స్పష్టమైన విషయమే జిల్లాకు ఒక సహకార సంఘం ఇస్తామని ప్రభుత్వంవారు అంటున్నారు కాంగ్రెసు శాసనసభ్యులు, ప్రతిపక్ష శాసనసభ్యులు — మొత్తం 75 మంది కలిసి ప్రభుత్వానుకు ఒక మెమొరాండము సమర్పించారు శ్రీ కొండా లక్ష్మణ్ గారు, దావుద్ హుస్సేన్ గారు కూడా ఆ సభ్యులలో ఉన్నారు 1957 వ సంవత్సరములో మెమొరాండము ఇవ్వడం జరిగింది. జిల్లాకు ఒక సహకారసంఘం చొప్పున పెడితే అవి ఏ కంట్రాక్టరు చేతిలోనో పడిపోతాయి కాబట్టి తాలూకాకు ఒక్క సంఘం చొప్పున పెట్టాలని వారు మెమొరాండంలో కోరారు యీ కార్యక్రమం జయప్రదంగా జరగడానికి ఇది ఒక ఎక్స్పెరిమెంటు అని చెప్పాము అయితే, శ్రీ కళా వెంకటరావుగారు దానిని ఇప్పుడు నిర్లక్ష్యం చేశారు అంతేగాదు శాసనసభ్యులంతా ఆలోచనలేకుండా ఏవో కాగితాలు పంపుతారని రిమార్కు కూడా చేశారు దీనినిబట్టి శాసనసభ్యులంటే మంత్రులకు ఎంత గౌరవము ఉన్నదో తేలుతోంది 75 మంది సభ్యులు చెప్పిన సూచనను నిర్లక్ష్యం చేశారు. మీరు సహకార సంఘం పెట్టరాదా, మిగిలిన వాటికి వలె నేడినికి కూడా మేము సహాయము చేయకపోయామా అని 1956 వ సంవత్సరములో శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు అన్నారు దానిని పురస్కరించుకొని నల్లగొండ జిల్లాలోని సూర్యాపేట, చిలుకూరు, నక్కిరపల్లి, నారాయణపురం తాలూకాలలో తాలూకాకు ఒక సంఘం చొప్పున రిజిష్టరు చెయించడం జరిగింది ప్రభుత్వంవారు వాటి విషయం 1956 లో చూడనేలేదు. 1957 లో మాత్రం జిల్లాకు ఒక సహకార సంఘమును తెరుస్తామని ప్రకటించారు అట్లా ప్రకటించగానే, లక్షలకొలది రూపాయలు బకాయి ఉన్న కంట్రాక్టరులందరు ఇక్కడకు వచ్చి మంత్రుల ఇండ్లు నిండిపోయినారు జిల్లాలు వదిలిపెట్టి హైదరాబాద్ నగరంలో camp చేసి, మాకు సహకార సంఘములు ఇస్తే నడుపుతాము మేమంతా చందాలు ఇచ్చేవారం, పెద్దలం మేము లేకపోతే మీకు ఏమీ పని నడువదు అని చెప్పుకున్నారు ఆ పైన, సంవత్సరం క్రితమే రిజిష్టరు చేయబడిన సహకార సంఘాలను ఏమీ లక్ష్యంలేకుండా వారికి ఇష్టం వచ్చినట్లుగా ఇవ్వడానికి సిద్ధం అయినారు ఈ విషయములన్నీ కూడా శాసనసభ్యులు మెమొరాండములో తెలియపర్చినారు దేవరకొండలో గవళ్ళవాళ్ళు, తాడిచెట్లు కూడా లేనిచోట్ల ఒక సంఘమును పెట్టినారు తంగేడుపల్లి తాలూకాలో కూడా గ్రామానికి 7 మైళ్ల దూరంలో ఒక సంఘమును పెట్టినారు ఆ ప్రాంతపు శాసనసభ్యులు ప్రభుత్వం దగ్గ

రకు రాయభారం కూడా వెళ్ళినారు దానిని దృష్టిలో పెట్టుకొని శ్రీ కళా వెంకట రావుగారు మార్చినారనుకొంటాను తంగేడుపల్లికి బదులు సూర్యాపేటకు గాని నారాయణపురమునకు గాని ఇవ్వాలని మేము చెప్పినాము. మంత్రిగారు సూర్యాపేటకు ఇచ్చినట్లుగా ఆర్డరు పంపించారు కాని, ఆ మరునాడే కంట్రాక్టర్లు అంతా కలిసి రాయభారం వెళ్ళి దేవరకొండకు మార్పించారు ఈ పరిస్థితులనుబట్టి, సహకార సంఘముల స్థాపనకూడా డబ్బు గలవారి చేతులమీదనే ఆధారపడి వుందని తేలుతున్నది సహకార సంఘములు వద్దు అని ఎవ్వరూ అనడం లేదు 20—7—1957 తేదీన యీ కో-ఆపరేటివ్ సొసైటీలను స్థాపించుటలో selling population కంటే tapping population కే ప్రిఫరెన్సు ఇవ్వాలనీ, అంటే tapping population ఎక్కువగా ఉన్నచోటనే యీ సహకార సంఘములను పెట్టవలెనని ప్రభుత్వంవారు ఆర్డరు జారీ చేశారు ఎవరో ఒక కంట్రాక్టరు ఉండి, దుకాణము పెట్టుకుంటే—తంగేడుపల్లిలో 200 కుటుంబాల గీతకార్మికులు ఉండగా వారందరినీ కూడా నిర్లక్ష్యం చేసి దేవరకొండలో షాప్ (shop) పెట్టారు నల్లగొండ పరిస్థితి కూడా అదేవిధంగా ఉన్నది అనేక ఇతరచోట్ల ఇాదే పరిస్థితి జరిగింది కో-ఆపరేటివ్ సొసైటీలు కావాలంటే సంతకాలు చేసి తీసుకురండి, ఇస్తాము అని ఒకసారి శ్రీ వెంకటరావుగారు చెప్పారు అప్పుడు మేము 9 మంది శాసనసభ్యులం, నల్లగొండ జిల్లాకుంచి, కనీసం జిల్లాకు ఒక సంఘమైనా కావాలని కోరినాము నల్లగొండ తాలూకా శ్రీ కొండా లక్ష్మణ్ గారి నియోజకవర్గములో నున్నదనుకొండి. సూర్యాపేట మరొక సభ్యుని నియోజకవర్గములో నున్నది ఆ ప్రాంతాలలో జనం ఎక్కువగా ఉన్నారు ఎక్స్పెరిమెంటల్ గా పరుక్ష చెస్తారనే ఉద్దేశంలో అక్కడ సంఘములను ఏర్పాటు చేయమని మేము రికమెండు చేశాము చేస్తే, 9 మంది శాసనసభ్యులు చెసిన సూచనను ప్రక్కకునెట్టి, మంత్రులను influence చెయగలిగినవారున్న మరొక చోటకు మార్చబోతున్నారని నాకు తెలిసింది. నల్లగొండకో, భోన్ గిరికో ఇస్తారట సూర్యాపేట సొసైటీని ఆక్షన్ నుంచి మినహాయిస్తూ ఆర్డర్లు పంపించారు నిన్ననే, నేను Excise Commissioner గారికి phone చేసి తెలుసుకొనగా ఆ రెండూ మినహాయించ బడినాయి, మాకు ఆర్డర్లు అట్లాగే వచ్చాయి అని వారు చెప్పారు సహకారమనేది అందరికీ వర్తించాలి Experimental సమస్య గత సంవత్సరమే పరిష్కారమైపోయింది ఈసంవత్సరం తిరిగి ఈ సమస్య ఎందుకు వచ్చింది ? అయితే, దీనికి ఒక కారణం ఉన్నదనుకొంటాను. పెద్ద కంట్రాక్టరుల ఎదుట, సహకార పద్ధతిని సరిగా అమలు పెట్టడానికి ఈప్రభుత్వం జంకుతున్నదని నేను చెబుతున్నాను ఈ మధ్య సుమారు 47 మంది శాసనసభ్యులు తాలూకాకు ఒక సొసైటీ కావాలని టెలిగ్రాముల ద్వారా, రాయబారాలద్వారా ప్రభుత్వానికి తెలియబరచినారు కాని, మన ప్రభుత్వం యీ విషయమై ఏమీ చేయడంలేదు ఇది ప్రమాదకరమైన పరిస్థితికి దారితీస్తుంది అలక్ష్యం చెసినట్లయితే

కంట్రాక్టర్సునుంచి డబ్బు ఖజానాకు రాదు వారు డబ్బు చెల్లించేందుకు అనేకరకాలైన ఆటంకాలను తెస్తున్నారు హైకోర్టుకు writ పోయి, ఏవో టెక్నికల్ కారణాలను చూపించి తప్పించుకుపోతున్నారు పెనాలిటీ బకాయీలన్నీ రద్దు చేశాము అని ప్రభుత్వం మొన్ననే ప్రకటించింది

చెట్లను గీసుకునేవారు సంవత్సరాల తరబడి చెల్లిస్తూనే ఉన్నారు ప్రభుత్వం చట్టవిరుద్ధమైన చర్యలు జరగకుండా చూడవలసి యున్నది ఈ వృత్తిమీదవచ్చే ఆదాయం అంతా ఖజానాకు వచ్చేటట్లు చూడాలి మిగిలినది పారిశ్రామికులకు చెందునట్లుగా చూడాలంటే గూత్తిపులను రద్దుచేసి ఏ ఊరికి ఆ ఊరికి సహకార సంఘాలను ఏర్పాటు చెయాలి కావాలంటే ఫైనాన్సియల్ అష్యూరెన్స్ తీసుకొనిఇస్తే సరిపోతుంది ఆవిధంగా చేస్తే 2, 3 నెలల్లో ప్రభుత్వం అడ్వాన్సు తీసుకోగలుగుతుంది కాబట్టి చెల్లించిన తరువాత ఎగవేస్తారనే ఇబ్బందిలేదు ప్రభుత్వం దానికి కూడా సిద్ధపడటంలేదు కో-ఆపరేటివు సొసైటీలలో కూడా కంట్రాక్టరులను పెట్టడానికి బై-లాస్‌లో అవకాశం కల్పించబడింది. ముందుగా 1000 రూపాయలు వాటా కట్టినట్లయితే ఇస్తారట అయితే 25, 30 రూపాయలు తెచ్చుకొనే గీతకార్మికులకు 1000 రూపాయలు ఎక్కడనుంచి వస్తాయి వారెట్లా కట్టగలరు ? అయితే వారికి 50 రూపాయల వాటా కూడా ఉన్నదని చెప్పవచ్చు పదిమంది కంట్రాక్టరులు చేరి పెట్టుబడి పెట్టుకొంటుంటే 50 రూపాయల వాటాదారు ఏమి చేయగలడు ? ప్రభుత్వం యితర సొసైటీలకు సహాయం చేసినట్లుగానే ఈ సంఘాలకు కూడా లోన్సు ద్వారా నో ఎయిడ్ ద్వారానో సహాయం చేసినట్లయితే ఇవి జయప్రదం అవుతాయి. ఇందుకు పభుత్వం పూనుకోవలసిన అవసరం ఉన్నది. అంతేగాని, కంట్రాక్టరుల మీదనే ఆధారపడి ఈ సంఘాలను నడిపితేమాత్రం వారు ప్రకటించిన ఆశయం నెరవేరదు. కాబట్టి ఈ తీర్మానం ద్వారా ప్రభుత్వం ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకొని అబ్కారీ చట్టాన్ని, రూల్సును, బై-లాస్‌నూ మార్చడానికి పూనుకోవాలని కోరుతూ నేను విరమిస్తున్నాను

*Sri Vasudeo Krishnaji Naik (Sultan Bazaar)* Sir, there are seven resolutions on the agenda and the time left is only 2 hours I think it is better if some time limit is prescribed for every speaker so that all resolutions could be finished today and movers of all resolutions could get opportunity to speak It is only one day we get to discuss resolutions of this type

మిస్టర్ ఛైర్మన్ దీనిలో hard and fast rule ఏమీలేదు. గౌరవసభ్యులు యేవిధముగా చెప్పితే ఆవిధముగా చేయవచ్చును. కాబట్టి యిప్పుడు న్నటువంటి

7 resolutions కు కొంత time allot చేసి ఇవన్నీ ఈరోజునే ముగించడానికి ప్రయత్నము చేయవచ్చును ఒక్కొక్క తీర్మానము తీసుకొని ఆ తీర్మానముపై చర్చ జరిపి దానిని ముగించవచ్చును సభవారు యేవిధముగా చెప్పితే ఆవిధముగా నడచుకుంటాను

బి ఎల్లారెడ్డి ఇప్పుడు ఈసభ ముగించడానికి 1½ గంటలు time వున్నది ఈకొద్దికాలములో యీతీర్మానాలన్నింటిపై చర్చజరపటము సాధ్యముకాదు వాటన్నింటిపై త్వరత్వరగా చర్చ జరిపితే యే తీర్మానమునకు న్యాయము చేసినవారము కాము అందుచేత వరుసక్రమములో ఒక్కొక్క తీర్మానముపై చర్చజరిపి మిగిలినవి postpone చేయవచ్చును లేకపోతే ballot అనేదానికి అర్థంలేకుండా పోతుంది

మిస్టర్ ఛైర్మన్ . Orderను change చేయవలసిన అవసరంలేదు చాలాఅరుదుగాయీ non-official day వస్తుంది కాబట్టి వీలయినన్ని resolutions పై చర్చజరపడము మంచిదని వారంటున్నారు

శ్రీ బి రత్నసభాపతి (బద్వేలు) అధ్యక్షా, ఒక్కొక్క resolutionతీసుకొని ఆ resolutionను సంపూర్ణముగా చర్చించడము మంచిది మిగిలిన resolutionsను తరువాత సమావేశమునకు postpone చేయవచ్చును అందుచేత తీర్మానములు వదలివేయడము మంచిదికాదు

మిస్టర్ ఛైర్మన్ వదలివేయమని వారు చెప్పలేదు

*Sri Vasudeo Krishnaji Naik* I have not said that they do not come up according to the order I only said that some time limit must be prescribed for each resolution so that all might get opportunities to speak

*Mr Chairman* We shall try

శ్రీ ఇ చిన్నప్ప (మహబూబ్ నగర్) అధ్యక్షా ఆresolutions చాలా ముఖ్యమైనవి వాటిలో శాసనసభ్యులు అందరకు సంబంధించిన resolutions వున్నవి వచ్చే శాసనసభ సమావేశానికి కొన్నింటిని postpone చేయడము మంచిదికాదు అందుచేత యీసమావేశములోనే అన్నింటిపై చర్చజరిపితే బాగుంటుందని మనవి చేస్తున్నాను.

మిస్టర్ ఛైర్మన్ సభవారిలో యీవిషయమై భేదాభిప్రాయాలున్నవి మీరు చెప్పిన ప్రకారముగాను వారు సాధ్యమైనంతవరకు ఈరెండింటిని సమన్వయపరచి సభాకార్యక్రమమును నడిపించవచ్చును. శ్రీ ధర్మభిక్షముగారి resolutionsపై యితరులెవ్వరైన మాట్లాడదలచుకుంటే మాట్లాడవచ్చును.

శ్రీ ఎస్. వి. కె ప్రసాద్ (చెన్నూరు) అధ్యక్షా, ఈ అబ్కారీ చట్టము తెలంగాణా ప్రాంతములో అమలులోనికి రాలేదని చెప్పవచ్చును. చాలారోజుల నుంచి యీ చట్టమును ధిక్కరించడము జరుగుతున్నది

మిస్టర్ చైర్మన్, మీరు 10 నిముషములలో ముగించవలసి వుంటుంది

శ్రీ ఎస్ వి కె ప్రసాద్ ఆంధ్రప్రదేశ్ యేర్పడక పూర్వము కొంతమంది పెద్ద కంట్రాక్టర్లు భూస్వాములూ ఈ అబ్కారీ వ్యాపారమును గుత్తకుతీసుకొని అటు ప్రభుత్వమును యిటు కల్లుగీత పారిశ్రామికులను తీవ్రముగా నష్టపరచుచున్నారు ప్రస్తుతము వున్న యీ contractor పద్ధతిని మార్చి ప్రభుత్వ ఆదాయం పెంపొందే రీతిగాను కల్లుగీత పారిశ్రామికులకు ఎక్కువ సదుపాయములు కలిగించే విధముగాను చేయవలెనని ఆంధ్రప్రదేశ్ ఏర్పడక పూర్వమునుంచి ప్రయత్నములు జరుగుతూ వచ్చినవి అప్పుడు శ్రీరంగారెడ్డిగారు Excise మంత్రిగా వున్నప్పుడు యీపద్ధతి అమలులోనికి వచ్చింది దాని అనుభవముల దృష్ట్యా యీపద్ధతిలోని మంచిచెడ్డలను పరిశీలించి, దానిని రద్దుచేయడము జరిగినది మరొక అనుకూల పద్ధతిని ప్రవేశపెట్టుటకు ప్రయత్నములు జరుగుతూవుండగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడినది ఈ contıact పద్ధతిని రద్దుచేసి సహకార సంఘాల ద్వారా దానిని నడిపించే పద్ధతిని ప్రవేశపెట్టవలసినదిగా కోరడమైనది ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాతకూడ వెనుక తెలంగాణాలో వున్న పద్ధతిలోనే పెద్ద పెద్ద భూస్వాములకు గుత్తకు యివ్వడము, వారు సంవత్సరము పొడుగునా అనుభవించి చివరకు ప్రభుత్వమునకు బకాయి పెట్టడము జరుగుతూ ఒకవైపు ప్రభుత్వమును రెండవ వైపు కల్లుగీత పారిశ్రామికులకు విపరీతమైన నష్టము కలిగినది ప్రభుత్వము యీ విషయమును సమగ్రముగా అర్థము చేసుకొనక నెమ్మదిగా సహకారసంఘాల పద్ధతిని ప్రవేశపెట్టుటకు ప్రయత్నిస్తున్నది కానీ యీసమస్య అంతసులభముగా పరిష్కారముకాదు. తెలంగాణాలో గ్రామాలకుపోయి పరిశీలించినట్లయితే, యీ పెద్దపెద్ద భూస్వాములు యేవిధముగా యీ అబ్కారీని తమప్రధానవృత్తిగా చేసుకొని లాభార్జనే తమ దృష్టిలోనుంచుకొని కల్లుగీత పారిశ్రామికులను దోపిడిచేస్తున్నారో అర్థమవుతుంది ఉదాహరణకు వరంగల్లు జిల్లాలో విష్ణురాధారెడ్డిదేశ్ ముఖ్ గారు అనే ఒక పెద్ద భూస్వామి వున్నారు వారిపేరు చరిత్రాత్మకమైనది వారు ప్రజలందరికి చిరపరిచితులు. ఈపరిస్థితిలో వారి ఆదాయము, యీఅబ్కారీ వ్యాపారమును ప్రభుత్వంనుంచి గుత్తకు తీసుకొని సంవత్సరముఆఖరున ఒకలక్ష లేక ఒకలక్షన్నర రూపాయల వరకు ప్రభుత్వమునకు బకాయి పెట్టడము జరుగుతున్నది దానినే వారు తమప్రదాన ఆదాయముగా పరిగణించుచున్నారు రెండవ సంవత్సరము తనపేరిటకాకుండా [illegible] పేరిటనో లేక తనదగ్గరపనిచేస్తున్న నౌకర్ల పేరిటనో యీఅబ్కారీ [illegible] త్వమునకు బకాయి పెట్టడము జరుగుతున్నది. [illegible] జరుగుతున్నది కాని ప్రభుత్వ Excise Department [illegible] క

పోవడము చాలా ఆశ్చర్యకరముగా వున్నది ఈ విధమయిన పెత్తందారీని చలాయిస్తూ ప్రభుత్వమును ప్రజలను తీవ్రముగ నష్టపరుస్తున్నారు ఇంకొక ఉదాహరణ చెప్పవలె నంటే జనగామా తాలూకాలో 10 లేక 12 గ్రామాలలో ఈతాడి వ్యాపారము చాలా విపరీతముగా వుంటుంది ఈతాడి వ్యాపారము వందల వేల సంఖ్యలో జరుగుతూ వుంటుంది కొన్ని గ్రామాలవారు కలసి ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్క contractor కు యిస్తారు ఆసంవత్సరము గుత్తకు తీసుకొన్న contractor ప్రభుత్వానికం చెల్లించకుండా బకాయి పెట్టడము జరుగుతున్నది ఇంకొక సంవత్సరము తమ ఏజంటు ద్వారా ఆ contract ఒప్పుకొని ఆ సంవత్సరముకూడ బకాయి పెట్టుతాడు ఈ విధముగా శ్రీ విష్ణురామ్‌దేశ్‌ముఖ్ గారు ఆ జనగామా తాలూకాలో కొన్ని లక్షల రూపాయలు సంపాదించినాడు దీనిని జిల్లా కలెక్టరువారి దృష్టికి తేవడమయినది అప్పుడు జిల్లాకలెక్టరు surprise check చేసినారు ఆ enquiry లో అంతా శ్రీ విష్ణురామ్ దేశ్‌ముఖ్ గారి నౌకరులో, లేక ఏజంట్లో అని యిదమిద్ధముగా తేలింది అయినప్పటికి మరుసటి సంవత్సరమునుంచి అంతా మామూలు పద్ధతిలో జరగడము ప్రారంభించినది శ్రీ విష్ణురామ్‌గారు ఈవిధముగా చేస్తున్నప్పటికి దీనిని అరికట్టడానికి ఎవరును సాహసించలేకపోవడంవల్ల Excise Department ను తనగుప్పిటలో పెట్టుకొన్నట్లు స్పష్టమవుతున్నది. Excise మంత్రిగారు దాదాపు 3 కోట్ల రూపాయలకు పైగా బకాయి వున్నవని వెల్లడించినారు ఈబకాయిలు సంవత్సరము సంవత్సరమునకు accumulate అయిపోతున్నవి ప్రభుత్వముకూడా విపరీత నష్టమునకు గురిఅవుతున్నది అందుచేత ఈ విష్ణురామ్‌దేశ్‌ముఖ్ గారినుండి ఈబకాయిలు వసూలుచేయడానికి ప్రభుత్వమువారు పూనుకొనకపోవడం చాలా శోచనీయముగా వుంది వెంటనే ఈవిషయములో ప్రభుత్వము తగు శ్రద్ధ వహించి ప్రభుత్వమునకు బకాయిల రూపంగా రావలసిన కోట్ల రూపాయలను realise చేస్తారని నమ్ముచున్నాను. ఎవరూ ఏమీ చేయలేరనే ధీమా వారికి ఉన్నది వారికి ఉన్న సంబంధాలు influence అలాంటివి అలాగే వెంకటాపురం అనే గ్రామంలో హరిపురాల దొరలగు రావుల బాలకృష్ణారెడ్డి మొదలగు పెద్ద భూస్వాములు ఉన్నారు వారు పెద్దకల్లుగీత కంట్రాక్టరులు ఈ సంవత్సరం వారిమీద చాలామంది రిపోర్టు చేశారు ఎక్సైజు ఇన్‌స్పెక్టరు ద్వారా కూడా ఒక రిపోర్టు పోయింది జిల్లా అధికారి తనకు యిష్టం లేకపోయినా surprise raid చేయవలసి వచ్చినది కారణం ఆ కంట్రాక్టర్లు చేసే విషయాలన్ని M L As తదితరులందరికి తెలిసిపోయింది Surpise raid చేయనిచో తన నెత్తిమీదకు వస్తుందని చేయగా కొన్ని వందలచెట్లు పట్టుబడ్డవి తరువాత ఆయన పోలీసువారికి రిపోర్టు చేశారు ఆ నెలుకుదిరి సబ్-ఇన్‌స్పెక్టరుకు పై అధికారులనుండి ఏమి information వచ్చిందో లేక ఏమి ఒత్తిడి వచ్చిందో కాని 40, 50 వేల రూ॥ల వరకు fine వేయవలసిన ఆ కేసును త్రొక్కి వేశారు ఈ విధంగా

ప్రభుత్వానికి బకాయిలు పెట్టడమేగాక బిలానంబరు చెట్లను గీస్తూ ప్రభుత్వానికి ఎంతో నష్టాన్ని కలిగిస్తున్నారు అందువల్లనే ఇటువంటి ప్రదేశాలలోనైనా సహకార సంఘాలను నెలకొల్పాలని మేము మొదటినుంచి కోరుతూ వచ్చాము వరంగల్ జిల్లాలో ఎక్కడో మూలనఉన్న నర్సంపేట తాలూకాలో ఒక సంఘాన్ని స్థాపించారు. కాని అక్కడ కల్లుగీత పారిశ్రామికులు గాని, చెట్లుగాని ఎక్కువగా లేవు కాబట్టి అలాంటి ప్రదేశాలలో సహకార సంఘాలను స్థాపించినను ప్రయోజనం ఉండదు జనగామ తాలూకాలోను, వరంగల్ తాలూకాలోను గీత పారిశ్రామికులు, చెట్లు ఎక్కువగా ఉన్నవి జనగామ తాలూకాలో విసునూరి రామచంద్రారెడ్డి $1\frac{1}{2}$ లక్షల వరకు బకాయి పెట్టాడు అటువంటి చోట సంఘాన్ని ఎందుకు స్థాపించరు ? కాబట్టి చెట్ల గీత, పారిశ్రామికులు ఎక్కువగా ఉన్న, బకాయిలు ఎక్కువగా పెట్టిన ప్రదేశాలలో వారి యిష్టం వచ్చినచోట సంఘాలను ఏర్పరచమనండి. అంతేగాని కొంతమంది కాంగ్రెస్ పెద్దలవెనుక ఉన్న కంట్రాక్టర్సు తరఫున కొంత పలుకుబడి పనిచేసినందున ఒక మూలలోఉన్న చోట సంఘాన్ని ఏర్పరచారు .

శ్రీ కె వెంకటరావు ,– I strongly protest against that allegation ఈ ప్రాంతంలో కంట్రాక్టర్సు ఎవరో నాకు తెలియదు వారి వెనుకఉన్న పెద్దలంటే నాకు apply కాదా ?

శ్రీ ఎస్ వి కె ప్రసాద్ మీ దగ్గరకు వచ్చిన పెద్దలవెనుక ఉన్న కంట్రాక్టర్సు అన్నాను అండి

శ్రీ కె వెంకటరావు · నా దగ్గరకు వచ్చిన పెద్దలకు వెనుక ఎవరూ లేరు. పెద్ద కంట్రాక్టర్సు అను అభిమానం నాకు ఏ మాత్రమూ లేదు మంచి income వచ్చునట్టి ప్రాంతాలనుగూడ సహకార సంఘాలకు ఇచ్చాము

*Mr Chairman* · Please keep to the substance of the resolution

శ్రీ యస్ వి కె. ప్రసాద్ Resolution ను దృష్టిలో పెట్టుకొనే మాట్లాడుచున్నాను నేను పై చెప్పిన మూడు విషయాలను దృష్టిలో పెట్టుకుని సంఘాలను స్థాపించిన ప్రభుత్వానికి బకాయిలు తగ్గుతవి తరువాత ఆ పారిశ్రామికు లకు కొంత లాభం వచ్చి వారి బాధలు ఈడేరుతవి శ్రీ ధర్మభిక్షంగారు నా కంటె serious విషయాలు కొన్ని చెప్పారు కాని ఆ సందర్భంలో మంత్రిగారు House లో లేకపోవుటవల్ల వారు వినిఉండక పోవచ్చు కాబట్టి రాజకీయ దృష్టితో కాకుండా గీతపనివారి శ్రేయస్సునే ప్రధానంగా పెట్టుకొని సంఘాలను స్థాపించాలి తరువాత జిల్లాకు ఒక సంఘముని గాక ప్రతితాలూకాకు 1, 2 చొప్పున ఉన్న [illegible] ఉంది గత సంవత్సరం కొన్ని ఇచ్చారు. అవి fail ఐనవి మంత్రి [illegible]

చెప్పటలేదు ఈ సంవత్సరమైనా నేను చెప్పిన సూత్రాలననుసరించి చర్యలు తీసుకోవాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను

శ్రీ డి. హనుమంతరావు (జగత్యాల) - అధ్యక్షా! తెలంగాణాలో కల్లుగీత పనివారి సహకార సంఘాలను ఏర్పరచాలి అనే తీర్మానాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను గత సంవత్సరం ఇచ్చిన ఈ సహకార సంఘాలు ఎంతవరకు ఈ కల్లుగీత పారిశ్రామికులకు ఉపయోగ పడినవో చూచిన ఈ తీర్మానానికి ఆస్కారమే కనుపించదు కంట్రాక్టర్లు, వ్యక్తిగతంగానో లేక కొందరితో కలిసియో ఈసంఘాలలో share amounts జమచేయించి భాగస్వాములై వ్యవహారాలన్ని వారే నడుపుచున్నట్లు మనకు తెలుస్తూనే ఉన్నది అంతేగాక వ్యక్తిగత కంట్రాక్టరుకు లేని సౌకర్యాలను ఈ సంఘాలకు కల్పించినా ఈ సంఘాలవారు కూడ బకాయిలు పెట్టడమేగాక అక్రమ చర్యలు, అవినీతి పద్ధతులద్వారా పనిచేస్తున్నట్లుకూడా పత్రికలద్వారానేగాక ప్రభుత్వానికి కూడ వివరాలు వస్తున్నవి కాబట్టి వీటినన్నింటిని పరిశీలించిన సహకార సంఘాల స్థాపనా నినాదమే అభివృద్ధికరమైన పంథాకాదు కల్లుపరిశ్రమ ప్రభుత్వానికి ఒకపెద్ద asset దీనిని సహకార సంఘాలద్వారా నడిపించిన కొద్దికాలంలోనే ఈ సంఘాలు బకాయిలుపెట్టి అసలు ఆదాయానికే ముప్పు వాటిల్ల గలదని మీద్వారా హెచ్చరిస్తున్నాను అందువల్ల ప్రభుత్వం మానేజీరియల్ సొసైటీని స్థాపించి, వ్యక్తిగత కంట్రాక్టరు దగ్గర గీత పని వారు exploit కాకుండా చూడవలయును తరువాత 5, 10 గ్రామాలను కేంద్రీకరించే పద్ధతి గాకుండా ప్రతి గ్రామంలోను ఒక్కొక్క చిన్నదుకాణాన్ని ఏర్పాటు చేయించిన గీతపనివారు వాటా ధనం కొరకు ఇబ్బంది పడవలసిన పనిఉండదు అందువల్ల పెద్ద పెద్ద కంట్రాక్టర్ల ప్రాబల్యం ఉండదు గీత పారిశ్రామికులు exploit కారు లేనియెడల వ్యక్తిగత కంట్రాక్టరు పేరున గాకపోయినా, మరొక పద్ధతిలో ఈ exploitation ఉండక మానదు ఈ సొసైటీలకు యిచ్చిన సౌకర్యాలలో మూడు నెలల "బైరక్కులు" తీసుకోకుండా, ఒక్క నెల "బైరక్కు" తీసుకునే పద్ధతి ఉంది వ్యక్తిగత కంట్రాక్టర్లకు ఆవిధంగా సౌకర్యాలు లేకున్నా, మూడునెలల "బైరక్కులు" తీసుకొని, ఆ deposit మొదలైనవికట్టి వ్యాపారం చేస్తున్నారు కొన్ని Societies వ్యక్తిగత contractors వలెనే 3 నెలల "బైరక్కులు" యిస్తూ, సొమ్ము deposit చేసి వ్యవహారం చేస్తున్నట్లు మనవద్ద reports ఉన్నాయి ఏ కార్మికులకు అయితే జీవనోపాధి కల్పించాలనే ఉద్దేశ్యంతో ఈ Societies ప్రారంభించ బడ్డాయో ఆ ఆశయానికే ఈనాడు భంగం కలుగుతోంది ఈ ప్రభుత్వం నూతనంగా ఒక Managerial Society ని ఏర్పాటుచెసి దానిని exploit చేయుటానికి కొన్ని సౌకర్యాలు కలుగచేస్తున్నారని తమ దృష్టికి తీసుకొని వస్తున్నాను

కల్లుతో బెల్లాన్ని, చక్కెరను తయారుచేయవచ్చు వీటిని తయారుచేయడానికి చిన్న చిన్న పరిశ్రమలు పెట్టి capital సమకూరిస్తే, ఈ వృత్తిలోఉన్న వారిని ఆవైపు diversify చేసి వారికి వేరేవృత్తిని చూపి, మేలుచేసిన వారమౌతాము Exploitation ను సమాజంనుంచి తొలగించిన వారమౌతామని మనవి చెస్తున్నాను ఇంక నూతనంగా ప్రభుత్వం Societies ను ప్రారంభించి వాటికి సౌకర్యాలు కలిగించదలిస్తే, groups పద్ధతి కాకుండా, వాటిని విడదీసి individual auctions, దానికి చిన్న చిన్న దుకాణాలను ఏర్పాటుచేసి వాటికి సహాయంచేస్తే, కల్లుగీత కార్మికులకు లాభంచేసినవారవుతారు ఈ విధంగా చేయమని కోరుతూ ఈ తీర్మానం అవుసరం లేదని చెబుతున్నాను

శ్రీ డి నరసయ్య (ఎల్లందు-రిజర్వుడు).- అధ్యక్షా! తెలంగాణాలో కల్లుగీత కార్మికుల సమస్య ఈవేళ మనకు క్రొత్తకాదు ఇది ఆంధ్రప్రదేశ్ ఏర్పడక పూర్వంనుంచీ ప్రభుత్వ దృష్టిలో ఉన్నది దీనికోరకు తెలంగాణాలోని కల్లుగీత కార్మికులంతా ఆందోళనచేస్తూ వచ్చారు శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు ఈ పద్ధతిని దాదాపు అంగీకరించారు ఆవిధంగా గీతకార్మికులందరికీ వాగ్దానంకూడా చేశారు దీనివల్ల దళారీపద్ధతి పోయి, గీసేవానికే చెట్టు హక్కువచ్చి, తమ శ్రమ ఫలితం తమకు దక్కుతుందని గీతకార్మికులందరు ఆశించారు ఆ పద్ధతి ననుసరించి — మంత్రిగారు అంగీకరించిన ప్రకారం — నల్లగొండజిల్లాలో ముఖ్యమైన ప్రదేశాలలో co-operative పద్ధతిపైన సంఘాలు పెట్టవలసిందిగా కార్మికులు కోరుతూ వచ్చిన సంగతి అందరికీ తెలుసు ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించిన దానిని అమలు చేయకపోవడం దురదృష్ట విషయమని ప్రజలందరు భావిస్తున్నారు ముందు ఈ సంఘాలను experimental గా పెడతామనిచెప్పి, జిల్లాకు 1 లేక 2 పంపకం చేస్తున్నారు వీటిని ఎటువంటి ప్రదేశాలలో ఏర్పాటుచేస్తున్నారో గమనించమని కోరుతున్నాను ప్రభుత్వం లోగడ చేసిన వాగ్దానాన్ని ఏవిధంగానైనా వాపసు తీసుకోవాలని తలుస్తోంది. ఆ ఉద్దేశంతోటే వీరు ఈనాడు ఏర్పాటు చేసే సంఘాలను failure అయ్యేచోట్ల experiment చేస్తున్నారు ఈవిధంగా experimental గా అవి failure అయినవని చూపించి ఈపద్ధతికే స్వస్తి చెప్పాలని ప్రభుత్వం భావిస్తోంది ఉదాహరణగా గతసంవత్సరం నల్లగొండజిల్లాలో దేవరకొండ గ్రూపు వ్యవహారంచూస్తే, యిదిఎంత నగ్నసత్యమో బోధపడుతుంది దేవరకొండలో కల్లుదుకాణమైతే ఉందికాని, కల్లుయిచ్చే తాడి, ఈతచెట్లు లేవు ఒకవేళ ఒకటి, అరా ఉన్నా గీసేవారు మాత్రం లేరు ఈలాంటి పరిస్థితులలో దేవరకొండకు experimentalగా ఎందుకుయిచ్చినట్లు? దానివల్ల ఎంత చక్కని ఫలితాలు వచ్చాయో మంత్రిగారు సెలవిస్తా రనుకొంటాను ఈ Co-operative Society పేరుతో అక్కడి కంట్రాక్టరుగారికి 80 వేలు లాభంవచ్చినట్లు, దానిలో కొంతభాగం పంపకాలుకూడా జరిగాయని వింటున్నాము ఇది వాస్తవంకాదా? ఆ society నే గనుక గీతపారిశ్రామికు లున్నచోట పెట్టినచో ఆ లాభం వారికే వచ్చేదికదా?

అసలు దేవరకొండలో ఎట్లా జరిగిందో ఆ కథనుగనుక చెబితే చాలా ఆశ్చర్యకరమైన విషయం మనకు అర్థమౌతుంది

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, అసలు దేవరకొండ bid రు 40 వేలు రు 4 వేలనుంచి 40 వేలకు తీసుకొని వచ్చారు Allegations కూడా 'స్వీపింగు' గా చేయడం న్యాయం కాదు Devarakonda కు ఏ కారణాల చేత యిచ్చారో చెప్పవచ్చు చెప్పే figures అంత high గా చెప్పి, వారికి ఏదో లాభం వచ్చినట్లు, అది పంపకమైనట్లు చెప్పడం న్యాయమైన విషయం కాదని మనవి చేస్తున్నాను

శ్రీ డి. నరసయ్య నేను చెప్పేది కాదు లోకం అనుకొంటుంది.

శ్రీ కె వెంకటరావు శాసన సభ్యులు బాధ్యతగల వ్యక్తులు గనుక లోకం అనుకొనేదానిని touch stone మీద పెట్టిన తరువాత, శాసనసభలో చెప్పడం మంచిది

శ్రీ డి. నర్సయ్య ప్రభుత్వంవద్ద దానికి సంబంధించిన లెక్కలు ఉంటే తెలియచేసినచో ప్రజలలోని అనుమానం తొలగిపోవడానికి వీలుంటుంది. ఆ ఉద్దేశ్యంతో నేను శాసన సభలో మనవి చేశాను దేవరకొండ గ్రూపుకు ఏ విధంగా యివ్వడం జరిగిందో దానిని జ్ఞాపకం చేసికోవడం తప్పా? సూర్యాపేటలో తాడి, ఈత చెట్లు చాలా ఉన్నాయి. అక్కడ కొన్ని వందల గీత కార్మిక కుటుంబాలున్నాయి అక్కడి కల్లు దుకాణం చాలా పెద్దది పరిశీలనార్థం పెడతామని చెప్పి వాగ్దానం చేసిన దుకాణాలలో అది మొట్టమొదటిది అక్కడి కార్మికులు 3 సంవత్సరాల క్రితం సహకార సంఘాన్ని పెట్టుకొన్నారు. చివరి క్షణందాకా సూర్యాపేటకే యిస్తామని గౌరవ శాసన సభ్యులకు కూడా వాగ్దానము చేసి, ఆఖరు క్షణంలో దేవరకొండకు ఏ ఉద్దేశ్యంతో మార్చారు? సూర్యాపేట తాలూకాలో సూర్యాపేట దుకాణానికి ఇస్తే ఏమి నష్టం వస్తుందని మార్చారు? గతసంవత్సరం అది ఒక పెద్ద చరిత్ర ఈ సంవత్సరం వచ్చింది అనగా యింకొక దుకాణం ఎక్కువగా యిస్తామన్నారు. దీనిలో మంత్రులనుంచి, కాంగ్రెస్ ప్రెసిడెంటు వరకు వ్యవహారం చేశారు. ఇవన్నీ దేనికోసరమని అడుగుచున్నాను. జిల్లాలోని శాసనసభ్యులందరు ఏకగ్రీవంగా ఎక్కడ కావాలని అడిగితే అక్కడ ఇస్తామని మంత్రిగారు వాగ్దానం చేశారు మేము 9 మంది M L As సంతకం పెట్టి సూర్యాపేటలో పెట్టమని కోరినాము ఎందుకట్లా కోరినామో కూడా వివరించాము. దాని తరువాత శ్రీ కొండా లక్ష్మణ్ గారు నల్లగొండ కావాలన్నారు. శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు భువనగిరి కావాలని కోరారు. వీరిద్దరికి తగాదా వస్తే దానిని పార్టీ తగాదాగా చేసి, చివరకు మేము తొమ్మిదిమంది కావాలన్న సూర్యాపేటను వెనుకకు నెట్టి భువనగిరికి దానిని allot చేశారు.

అవి తేలకపోతే నల్గొండ, భువనగిరి, సూర్యాపేట ఈ మూడుచోట్లఉన్నదుకాణాలను హర్రాజు వేయకుండా మిగిలినవి వేయమని మేము కోరాము ఈ సందర్భములో కాంగ్రెసు ప్రెసిడెంటుగారకడకు వెళ్ళి ఈ విషయంలో జోక్యం కలుగచేసికొని పెద్ద రాద్ధాంతం కలుగ జేస్తున్నారని వింటున్నాము ఈ విషయంలో కంట్రాక్టర్లు బాగా ఫండ్సు ఇచ్చారనివింటున్నాము ఈ విషయాలన్నిటిని దృష్టిలో పెట్టుకున్నట్లయితే దురభిప్రాయాలు కలుగడానికి అవకాశం ఏర్పడుతుంది

శ్రీ కె వెంకటరావు : ప్రతి విషయాన్ని వినికిడి అని చెప్పడం మంచిదికాదు

శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం జనరల్) వినికిడి అనేపదం అసెంబ్లీలో ఉపయోగించవచ్చా ?

మిస్టర్ చైర్మన్ వినికిడి అనేది perfect parliamentary word

శ్రీ డి నరసయ్యా . వినికిడి అని చెప్పకపోతే అగారిటేటివ్ గా ఆధారాలు దొరకడం కష్టం మంత్రులు నాయకులు అంతా ఈ విషయంలో జోక్యం కలిగించుకుంటున్నారు జిల్లా కాంగ్రెసు కమిటీలో చెసిన తీర్మానాన్ని అచట అమలు జరపడానికి ప్రయత్నిస్తున్నారు ఈనాడు ప్రభుత్వం భువనగిరికి, నల్గొండకు ఏ ప్రబలమైన కారణాలు చెపుతున్నదో అంతటి ప్రబలమైన కారణాలు సూర్యాపేటకు కూడా ఉన్నాయని నేను మనవి చేస్తున్నాను తొమ్మిదిమంది యం యల్ ఏ లు చెప్పిన ముఖ్య విషయమిది కనుక గీతపారిశ్రామికుల కోర్కెలను తీర్చడంలో ప్రభుత్వం కొద్ది శ్రద్ధ వహించి న్యాయంగా నిర్వహించాలని మీద్వారా మంత్రిగారికి మనవి చేస్తూ ఇంతటితో ముగిస్తున్నాను

శ్రీ అమృతలాల్ శుక్లా (సిరిసిల్ల-జనరల్) , అధ్యక్షా, ఈ నాడు కల్లు గీత సమస్య పెద్ద సమస్య అయినది కల్లుతాగితే కలిగే మత్తు చికిత్స చేస్తే తగ్గుతుంది కాని, ముస్తాదర్లకు కలిగే మత్తు మొత్తం దేశానికే బాధను కలిగిస్తున్నది పూర్వం కల్లుగీత వృత్తి చేపట్టడానికి ఎవరూ ఇష్టపడేవారు కారు ఈ వృత్తి చెడ్డదని భావించి ఎవరూ పోటీకి వచ్చేవారుకారు కాని ప్రస్తుతం ఈ వృత్తికే పోటీ ఏర్పడి పెట్టుబడిదార్లకు స్వార్థపరులకు ఈ వృత్తి ఎక్కువ ఆదాయాన్ని తెచ్చిపెట్టగలుగుతోంది తెలంగాణాలో కల్లు గీతపై జీవించేవారు 12 లక్షలమంది ఉన్నారు భూమిపై పన్ను వేసే అధికారం శాసన సభ చేతుల్లో ఉంటుంది కాని కల్లు చెట్టుపై పన్ను వేసే అధికారం అచ్చట ధనవంతుల చేతుల్లో ఉండటం వల్ల ప్రజలు బాధపడుతున్నారు భూమిపై పండించిన పంట నిలవ ఉంటుంది కాని గీసిన కల్లు ఆ రోజు అమ్మకపోతే చెడిపోతుంది ఇంత కష్టపడే గీత కార్మికులు వెనకబడిన జాతి

వారిక్రింద పరిగణింప బడుతున్నాడు "దున్నేవారికే భూమి, గీసేవారికే చెట్టు" అనే నినాదము హైదరాబాదు ప్రభుత్వ కాలములోనే వచ్చింది ఈ నినాదాన్ని అంగీకరించి అమలులో పెట్టడానికి జరిగిన తంత్రములు మనకు తెలియనివి కావు. సొసైటీలకే చెట్లను ఇవ్వాలని నిర్ణయించారు కాని లాభాలు పొందేవారి కుట్రలవల్ల దీనిని మానుకున్నారు ఈ సమస్య మనకే కాక కాంగ్రెసు పార్టీవారికి కూడా ముఖ్యమైనదే హనుమంతరావుగారు చిన్న చిన్న గ్రూపులకు ఇవ్వకుండా గ్రామాన్ని ఒక యూనిట్‌గా చేసి ఇస్తే బాగుంటుందని చెప్పారు సహకార సంఘాలకు గ్రూపులకు కాకుండా చిన్న చిన్న యూనిట్సు చేసి ఇస్తే కల్లుగీతవారికి అన్యాయం కలగదని మనవి చేస్తున్నాను సహకార సంఘాలలో భూస్వాములు, పెట్టుబడిదారులూ చేరకుండా చేసినా ఈ సమస్య పరిష్కరించ బడుతుంది సహకార సంఘాలకు ఇచ్చిన తర్వాత మంత్రుల చుట్టు కాంగ్రెసు ఆఫీసులచుట్టు తిరుగుతూ ఉండటం అందరికీ తెలిసిన విషయమే ఏలా పనిచేస్తాయో చూడడానికి ఎక్స్‌పరిమెంటల్‌గా సహకార సంఘాలు పెట్టబడ్డాయని మంత్రిగారు చెప్పారు ఇకముందు వీటిని నడపకుండా ఉండటానికే ప్రయత్నిస్తున్నట్లు గీత పారిశ్రామికులకు అనుమానం కలుగుతున్నది సిరిసిల్లా సంఘం రెండు ఖాతాలను maintain చేస్తూ లాభాల ఖాతాలను ఒకదానిలో వ్రాస్తూ మరొక ఖాతాను ప్రభుత్వానికి చూపిస్తున్నారని వినికిడి వినికిడి విషయాన్ని చెప్పడం మంచిదికాదని మంత్రిగారన్నారు వినికిడి విషయాలు అబద్ధాలని చెప్పలేము ప్రతి విషయానికి proof తేవాలనేది కష్టమైన పనే.

అక్కడ పరిస్థితులను చూసి చెప్పే ప్రజలున్నారు ఈ సంఘాలను కాపాడుకోవాలని అనేక సలహాలు ఇస్తున్నారు త్రాగుడు మంచిదికాదు అయినను త్రాగుడును తగ్గించుటకు కూడా పద్ధతులు వేరేఉన్నవి అంతేకాని గీత పనివారిని నిరుద్యోగులుగా చేసే పద్ధతి మంచిదికాదు ప్రధానమైన ఈ గీతపనివారి సమస్యను దృష్టిలో పెట్టుకొని వ్యవహరించవలెనని మంత్రిగారికి విన్నవించుకుంటున్నాను

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఈ తీర్మానాన్ని నేను వ్యతిరేకరించక తప్పడంలేదు ఏ రోజున తెలంగాణాలో కూడా మద్య నిషేదాన్ని ప్రవేశపెట్టి సభ్యుల కోరికను పూర్తిగా తీర్చేరోజు వస్తుందా అని ఎదురు చూస్తున్నాను. అమృతలాల్ శుక్లాగారు కూడా త్రాగడం మంచిది కాదనే అంటున్నారు. ఎప్పటికైనా మద్య నిషేధాన్ని ఇక్కడ కూడ ప్రవేశపెట్టక తప్పదు. ఆ శుభోదయం ఎప్పుడు వస్తుందా అని మనస్సులో ఆతురత పడేవారిలో నేను ఒకణ్ణి కాని కుదిరిన అంగీకారాల వల్ల పురోభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని తెలంగాణాలోని పరిస్థితులవల్ల, ఈరోజుననే దుకాణాలు మూసివేసే పరిస్థితి ఏర్పడనందుకు చింతిస్తున్నాను. మద్రాసు రాష్ట్రంలో Prohibition శాఖామంత్రిగా ఉండి ఇక్కడ Excise శాఖమంత్రిగా నేను

చేయవలసివచ్చినందుకు బాధగానే ఉంది. చిన్నప్పటి నుంచు ఏర్పడిన భావాలను పోగొట్టుకొని నా portfolio కు వచ్చిన excise వ్యవహారాలను పరిపాలన చేయువలసి వచ్చినందున మనస్సులో నాకు విచారం కలుగుతున్నది కాని ఈ portfolio తీసుకున్నప్పటినుంచి నాకు ఒక కోరిక ఉన్నది ఈ డిపార్టుమెంటులో 5 కోట్ల రూపాయలు బకాయిపడి ఉన్నది. అనేక వేల పిటిషన్లున్నాయి మామీద పెనాల్టి వేశారని కాలవ్యవధి నిప్పించాలని ఇంకా ఎన్నో రకాల పిటిషన్లు ఉన్నాయి 20, 25 సంవత్సరాల క్రితం బకాయిలు కూడా కొన్ని ఉన్నాయి ఈ puzzle లో నుంచి ఎట్లా బైటకు రావాలి అనే విషయం విచారణ చేసినతరువాత ఒక G O వేసినాము వసూలుకాకుండా ఉన్న బకాయిలను కొన్నింటిని రద్దుచేశాము కొన్నింటిపై తగ్గించాము — మిగిలిన మొత్తాలను 5 సంవత్సరాల వాయిదాలలో వసూలు చేయుడానికి నిర్ణయించాము కంట్రాక్టర్లు నన్ను చూడడానికి ఎవరూరాలేదు ఎటిగి ఉన్న కంట్రాక్టరెవరైనా నా దగ్గరకు వస్తే interview కూడా ఇవ్వను ఈ డబ్బు వసూలు చేయడానికి యత్నమే చేయరు పెద్దవాళ్లు ఇందులో ఉన్నారు అనడంలో అర్థంలేదు 43 గ్గురు డిప్యూటీ తాసిల్దారులు, రెవెన్యూ ఇనస్పెక్టర్లు వారికి సంబంధించిన staff బకాయిలను వసూలు చేయడానికి ప్రత్యేకంగా నియమించాము ఆ పని జరుగుతున్నది ఆరోజునకు తినడానికి తిండిలేనివారు కూడా ముస్తాజరులే, ఒక మూల లక్షాధికారులు ముస్తాజరులే నిజమో, అబద్ధమో నాకు తెలియదు కాని వీరిలో కొందరి ఇండ్లలో జప్తు చేయడానికి సరిపోయిన సామానులు కూడా లేవట. మరొక G O ను కూడా వేయువలసి వచ్చింది Civil Procedure Code క్రింద జప్తు చేయదగ్గ వస్తువుల నన్నింటిని జప్తు చేయడంవల్ల అటువంటి వారికి చాలా ఇబ్బందులు కలుగుతున్నాయని అట్లా వల్లకాదని G O వేశాము చిన్నవాటికోసమే ఏ కృషి జరిగినా జరుగుతోంది కాని పెద్దవాటికోసం ముఖ్యంగా నేనువచ్చిన తరువాత జరగడంలేదని నేను ఘంటాపథంగా చెప్పగలను ఏదోవిధంగా ప్రభుత్వాన్ని అనాలి, ఆరోపణలు చేయాలి అనుకుంటే తప్ప అలా అనడంలో వాస్తవం లేదని మనవి చేస్తున్నాను బకాయిలను వదలి పాట వేస్తున్నారని చెప్పారు దానికి కారణాలు చెప్పారు పెద్దవాళ్లు పాడుకుంటారు చెల్లించరు మరొకరి పేరుతో పాడతారు, అన్నారు నేను సగర్వంగా చెబుతున్నాను గత సంవత్సరము 96% వసూలైనది 100 రూపాయలు పాట ఉంటే 96 రూపాయలు వసూలు చేశామన్నమాట మిగిలిన 4% నే బకాయి అంటారా ? ఇదివరకు ½ కోట్ల రూపాయలు బకాయి అంటారా ? ఈ విషయంలో వచ్చిన మార్పును గుర్తించి ఎంత కఠినంగా వ్యవహరిస్తున్నామో చూడాలని కోరుతున్నాను ఈ సంవత్సరం కూడా అదే పద్ధతిలో సెప్టెంబరు నెలాఖరులోగా వర్తమానంలో ఉండే పాట మొత్తాలు వసూలు చేయబడుతున్నాయి ఈ విషయంలో ఏ రకమైన favour ఏ పరిస్థితులలోను

ఎవరికి చూపడం లేదు ఆఖరుకు క్షామ పరిస్థితులు వచ్చాయి, వాయిదా ఇప్పించండి అన్నా ఇవ్వకుండా కఠినంగా వ్యవహరిస్తున్నాం పెనాల్టీలు బిల్లు మక్తాల విషయం తీసుకుంటే ఒక కరీంనగర్ జిల్లాలోనే చాలా నంబర్లమీద పెనాల్టీల క్రింద 9 లక్షల రూపాయలు వసూలు చేశాము ఒక లక్ష చెట్లు పట్టుకో బడ్డాయి రాష్ట్రం మొత్తం మీద లెక్కలు నా చేతిలో లేవు ఆ file ను ఈ మధ్యనే చూడడంవల్ల జ్ఞాపకం ఉన్నది ఈ విషయంలో ఏవిధమైన అశ్రద్ధ చూపకపోవడంవల్లనే గడచిన సంవత్సరం 96% పాట మొత్తం వసూలు చెయడానికి కారణమైనది ఇక్కడ సృష్టించిన చిత్రం — ఎవరికో favour చూపడానికి, ఎవరివల్లనో లాభ సాటి పరిస్థితి ఉండడంవల్ల, అంతా అంకెలనుబట్టి ఏదో జరుగుతోంది అనడం కాని, జరిగే వ్యవహారాన్నిబట్టి కాని చూస్తే వాస్తవం కాదని తెలుస్తుంది. ఇటువంటి మాటలు ఏమాత్రం పెద్ద మనుష్యుల మధ్య మాట్లాడుకోవలసిన విషయాలు కావని చెప్పగలను. ఖనికిడివల్ల ఏమైనా చెప్పవచ్చు వెంకటరావుగారింటికి మొన్న రాత్రి ఎవడో 50 వేలు రూపాయలు పట్టుకు వెడుతున్నాడు, నేను చూచాను అని చెప్పవచ్చును ఈ వెంకట రావు ఎవడు, అతని previous history ఏమిటి, అతడు ఇట్లాంటి వాణ్ణి రానిస్తాడా, రానియ్యడా అనే విషయం కూడా చూడకుండా అలాంటి ఆరోపణలు చేయడం ఏవిధమైన న్యాయంగాను లేదని సోదర సభ్యులకు మనవి చేస్తున్నాను. మరొక ముఖ్య విషయం ఏమిటంటే వారు 1950 నాటి figures quote చేస్తున్నారు తప్పు ఉంటే దిద్దుకోడానికి సిద్ధంగా ఉన్నాను 9 లక్షలు ఇవ్వవలసివస్తే 50 వేలు వసూలుచేశారని 1950 ని, 1958 కి apply చెసి చెప్పడం న్యాయంగా ఉండదు రెండవ charge, ఎక్కడో వెదకి ఎవరికో ఇస్తున్నారని, పెద్ద పట్టణాలు పెద్ద గ్రూపులు గురించి చూడడం లేదని. ఈ ఏడు కరీంనగర్, నిజామాబాద్, అదిలాబాద్, మహబూబ్ నగర్, నాలుగూ జిల్లా కేంద్రాలకే ఇచ్చాము. ఒక చోట 3 లక్షల 98 వేల రూపాయల పాట ఉన్నదానికి కూడా ఇచ్చాము

శ్రీ బి. ఎల్లారెడ్డి కంట్రాక్టర్లకు ఉపయోగపడుతోందనేదిఉన్నది

శ్రీ కె వెంకటరావు · అది రెండవ charge, పెద్ద ప్రదేశాలకు ఇవ్వలే దన్నది మొదటి charge. ఇచ్చారా, లేదా, అంటే ఇచ్చారు — అది పోయింది. ఇక కంట్రాక్టర్లకు ఇస్తున్నారనే charge ఉన్నది. నా దృష్టిలో కంట్రాక్టర్లెవ్వరికీ ఇవ్వలేదు. కంట్రాక్టరుకు society లో interests ఉన్నాయా, లేవా, అనే charge న్యాయమైనది ఈ విషయములో ఎక్కడైనా ఏమైనా ఉంటే విచారణ చేసి చర్య తీసుకొనకతప్పదు. నా దృష్టిలోకూడా కొన్ని ఉన్నాయి ఒక్కడికి కంట్రాక్టరన్న వాడికి ఇవ్వలేదు — ఈ minute వరకు. 30 వ తారీఖునాటికి ఒక conference పిలిచాము. Excise, Co-operation Department వారిని పిలిచి మెహిదీగారు నేను

మార్చని bye laws లో ఉండే తేడాలు ఏమిటో ఎటువంటి అన్యాయం జరగడానికి ఆస్కారం ఎట్లా వస్తుందో విచారించి, పాతవి ఏడు, క్రొత్తవి తొమ్మిది వీటి విషయమై చేయవలసిన మార్పులు ఆలోచిస్తాము

శ్రీ బి ఎల్లారెడ్డి ఇపుడు చేసిన మార్పులు ఏమిటో సెలవిస్తారా ?

శ్రీ కె వెంకటరావు 30 వ తారీఖున conference ఉన్నదంటున్నప్పుడు ఇపుడే ఏమి చెబుతాను తరువాత ఎల్లారెడ్డిగారు దయవుండి వస్తే తెలియచేస్తాను

శ్రీ బి. ఎల్లారెడ్డి ఈలోపల allot అయిపోతాయి కదా !

శ్రీ కె వెంకటరావు ఈ సంవత్సరం ఇవ్వదలచుకున్నవి నిశ్చయం చేసుకున్నాము ఇపుడు మార్చదలచుకోలేదు ప్రదేశాలను గురించి లేదు నడిపించడం గురించి వచ్చిన విమర్శ. వెంకయ్యకో, పుల్లయ్యకో ఇవ్వడానికి ప్రభుత్వం నిర్ణయించుకోవాలి. అటువంటప్పుడు అనేక సందర్భాలను గురించి ఆలోచించుకోవాలి

దేవరకొండ గురించి ఉదహరించారు గత సంవత్సరము అక్కడ యిచ్చారు. కె ఎల్ నరసింహారావుగారు ఇంకో విషయము మాట్లాడుతూ కొన్ని ఉదహరణలు చెప్పారు నేను ఆ రోజుననే ఆఫీసుకు వెళ్ళి దీనిమీద చర్య తీసుకొన్నాను దేవరకొండ పరిస్థితి ఏమిటి ? ఎంతమంది members వున్నారు, ముస్తాజరీ ఎంతకు యిచ్చారు; దీనివల్ల లాభము ఏమి వచ్చింది, ఎవరికి పంచిపెట్టారు? దీనికి అప్పుడే enquiry చేయమని orders వేశాను Concerned officers ను అడగలేదు కలెక్టరును ఈ విషయములో enquiry చెసి report యివ్వాలని చెప్పాను ఇంతవరకు దేవరకొండకు renew చెయలేదు ఈ enquiry మనము అనుకొన్న ప్రకారము జరిగినట్లయితే, నేను విన్నవిషయాలు నిజమైనట్లయితే, 18 మంది మెంబర్లు వున్నారు ఇప్పటికి 34 గురు అయ్యారు Tappers ను ఇంకా మెంబర్ల క్రిందు చేర్చుకోలేదు, అని వచ్చినవి వాటిని గురించి విచారణ జరుగుతోంది ఈ విచారణ సంతృప్తికరముగా లేకపోతే, తప్పు జరిగిందని తోస్తే దేవరకొండ ఈ సంవత్సరమే cancel చేయిస్తాను దానిలో ఏవిధమైన అనుమానము లేదు Enquiry అప్పుడే నడుస్తున్నది. 2, 3 రోజులలో తెలుస్తుంది తెలియగానే చర్య తీసుకొంటాను ఎటువంటి చర్య తీసుకొనడానికీ నాకు అభ్యంతరములేదు నా దృష్టిలో కొన్ని ఉన్నాయి. ఏదైనా కళ్ళు మూసుకొని చేయదలచుకోలేదు అన్యాయము జరుగరాదు. ఏ వ్యక్తి లాభము కొరకుగా వినియోగించుకొన్నట్లు రుజావు అయితే ఆ contractor ను రద్దుచెస్తాను కొత్త సంవత్సరమునకు ఇంకా renew చేయలేదు కొత్తగా ఇవ్వకపోవడమే కాకుండా వున్నదానిని రద్దు చేయడానికి ప్రభుత్వము సిద్ధముగావుంది, అని మనవిచేస్తున్నాను ఇంకా ఏ సొసైటీలగురించి అయినా గౌరవసభ్యులకు తెలిసిన

త్వరలో నాకు అందచేయవలసినదని కోరుతున్నాను ఎప్పుడూ contractor permanent కాదు Co-operative Tappers' Society వున్నంత మాత్రాన స్థిరముగా వారికి యిస్తామనే నిర్ణయములేదు వారు చేయు ప్రతి తప్పుకు వారు బాధ్యులు తప్పుకనుక వున్నట్లయితే contract రద్దు అవుతుంది Single Village Society పెడితే బాగుంటుందని మనవిచేశారు ఇది అంతా Experimental Scheme బాగున్నది అనుకొన్న తరువాత ఒక్కసారుగా హెచ్చు number కి ఇవ్వడానికి అభ్యంతరమేమీ వుండదు బాగున్నదని గుండెమీద చేయి వేసుకొని చెప్పడానికి ప్రభుత్వము తగిన పరిస్థితిలోలేదు ప్రతిపక్షమువారు దీనిలోవున్న లోపాలను బహిరంగ పెడుతున్నారు విషయాలన్నింటిని పరిశీలించకుండా చర్యలు తీసుకొనడం సబబు కాదు వచ్చే సంవత్సరములో ఒక Village Society కి ఇచ్చి experiment చేయుటానికి నిర్ణయించాము ఖమ్మంజిల్లాలో ఒక Village Society కి ఇచ్చి ఆ ఒక్క గ్రామానికే ఇచ్చి ఎలా operate చేస్తుందో చూస్తాము Group లో ఈ లోపాలు కనుపిస్తున్నాయని అంటున్నారే Village పెడితే ఏలోపాలు వస్తాయి? అక్కడ influence వస్తుంది Real tapper కి వస్తుందో లేదో అనే విషయముకూడ దృష్టిలో వుంది అయితే చేయబోవు సవరణలో ఏదైన సూచనఉంటే చెప్పమన్నారు ఒక ప్రధాన సూచనగా మనస్సుకు తట్టింది చెప్పుతున్నాను ఈ సొసైటీలలో కల్లును ఎంత మంది కూలీలక్రింద ఎంతమంది భాగస్వాములక్రింద గీస్తున్నారో వారు అంతాకూడ ఈ సొసైటీలో members గా వుండేవారికి contract ఇస్తాము లేకపోతే ఇవ్వము అంతకంటే assurance అక్కరలేదు

All the members who tap the trees under that Society to bring the amount of sendhi needed, they must be members in that Society and should be beneficiaries of the profits that may arise out of it. వారు అందరు మెంబర్లుగా వుండాలి They must all be tappers. ఈ మార్పు Society by-laws లో తీసుకొనివచ్చే ఆలోచన నా దృష్టిలో వుంది దానిని మేము చర్చించి ఈ ఏడు ఇచ్చు contract లో ఒక clause పెట్టి దానిని enforce చేసి యివ్వాలని అనుకొంటున్నాము

శ్రీ బి. ఎల్లారెడ్డి: Share amount ఎంత పెట్టుతున్నారు?

శ్రీ కె. వెంకటరావు : 2 సంవత్సరముల సగటు మొత్తము ఇదివరకు 1 రూపాయి Share ఉంది 1000 రూ॥లు Share వుంది 1000 రూ॥లు అన్నది తీసివేయవచ్చును గత సంవత్సరం order సెప్టెంబరు నెలాఖరులో పడింది అందుచేత వారు deposit కట్టవలసి వచ్చింది డబ్బుకట్టి వారందరు మెంబర్లుకావలసినదే. నేను మీరు వెళ్ళి దానిలో Share వేయడముకోరకూడదు ఆవృత్తిలో వున్నవారు

కూడ Share లు వేసుకొనడానికి అవకాశము కల్పించబడింది. నేను చెప్పిన ప్రకారము అవసరమయితే దానినికూడ తీసివేయవచ్చును.

శ్రీ బి. ఎల్లారెడ్డి: ఇప్పుడు ఉన్న ...లో ఇంకొక టీరు కూడ వుంది. 50 రూ॥లు ఒక్కొక్క Share అని వుంది. 3 రకాలు వున్న మాట నిజమే. 10, 50,1000 రూ॥ Shares అని మూడు రకాలున్నవి.

శ్రీ కె. వెంకటరావు: A, B, C అనే మూడు రకాలు వున్నాయి అన్న మాట ఎప్పుడు ఏమి కారణాల వల్ల?

శ్రీ బి. ఎల్లారెడ్డి: ఆ విధం అనుకూలముగా వుండేటట్లు ప్రతి Share-holder 10 రూ॥లో 15 రూపాయలలో ఐతే కొనుక్కుంటుందని అందరు చేరడానికి వీలుందని చెప్పుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు: ఈ విషయాన్ని ఆలోచిస్తానని చెప్పాను. ఆలోచిస్తాను. Tappers దానిలో ఉండాలనేది అందరికి యిష్టమే కదా. ఎక్కువ Share Capital వున్నా అతడు ఎక్కువ లేడు కదా. ప్రభుత్వము ఇచ్చిన Share Capital కు సరిపోయిన లాభమయినా ఆయన కచ్చే కు లిక్కెన ఆయనకు వస్తే చాల సంతోషిస్తాడు. ఆ రకమైన organisation మనము develop చేయవచ్చును అని ఆశిస్తున్నాను. ఈ సంవత్సరము ఈ experiment succeed అయితే ముందు సంవత్సరము ఇంకా ఎక్కువ చేసుకొనడానికి వీలవుతుంది. Village society గురించి చెప్పారు. Experiment జరుగుతోంది. అదికూడ ఫలప్రదమైతే ఇంకా అనేక చోట్ల పెట్టవచ్చు. ఇంకొక విషయము చెప్పారు. కొంతమంది కలిసిన గ్రామానికి ఇస్తానని చెప్పానని కొంతమంది సభ్యులు చెప్పారు. తు, చ తప్పకుండా ఇస్తానని నేను అంగీకరించలేదు. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ప్రెసిడెంటు అయినాసరే ఇంకొక ఎం. ఎల్. ఏ. అయినా సరే మంత్రి అయినా సరే. ఫలానా వూరికి ఇమ్మంటే నేను ఇచ్చేరకము కాదు. ఇవ్వను. ఎవ్వరూ నాకు చెప్పడము లేదు కూడాను.

శ్రీ బి. ఎల్లారెడ్డి: మనము మానవమాత్రులము.

శ్రీ కె. వెంకటరావు: వారు కూడ మానవమాత్రులే. దీనిలో influence తీసుకొని పోవలసిన ఆవశ్యకత నాకు కనుపించడము లేదు. హైదరాబాద్ అయితే, సికిందరాబాద్ అయితే ఏమిటి తేడా అని నా మనస్సులో వున్న బాధ.

శ్రీ బి. ధర్మభిక్షం: వరకాంతానికి brothers వున్నారు.

శ్రీ కె. వెంకటరావు: ఎవరో వరకాంతం గోపాలరెడ్డి అని ఒకరు వున్నారని విన్నాను. ఈ మధ్య వారిని నేను చూడలేదు. అందుచే ఇక్కడ ఆ పేర్లు చెప్పడం

న్యాయము కాదు ఎందుకంటే వారు ఇక్కడకు వచ్చి defend చేసుకొనలేరు మనం ఇక్కడ వున్నాముకదా అని పైవాళ్ళ పేర్లు చెప్పడం న్యాయంకాదు I say then, Varakantham whoever he is, he has never come to me during the last 1½ years that I have been here నా వద్దకు ఎందరు కాంగ్రెసువారు shop ఇవ్వమని వచ్చినారో అంతమంది కమ్యూనిస్టు మెంబర్లు వచ్చిరి

శ్రీ బి. ఎల్లారెడ్డి వారికి లాభమయింది. వీరికి లాభము కాలేదు

శ్రీ కె వెంకట రావు వారు చెప్పినలాభము కోరి వారు వచ్చినారా? అక్కడనుంచి 40 వేలు వచ్చాయని అది పంపకము జరిగింది అని allegation చేశారే అందుకొరకే వారు వచ్చారా? వీరు వచ్చినట్లే వారు వచ్చారా? కొంచెము ఒక level లో ఉండాలి ప్రతిపక్ష సభ్యులు అంతా సత్యహరిశ్చంద్రులు అయి జన్మించినట్లు ఇవతల వున్నవారు అంతా ఇంకొకరకమైన మనుష్యులైనట్లు మాట్లాడుతున్నారు అంతా ఒకటే అందరిగి ఒకటే heart అంతా ప్రజలకు సేవచేయుటకే ఇక్కడకు వచ్చాము 9 మంది సభ్యులు సూర్యాపేటకు ఇవ్వమని వస్తె వారు ఏదో వసూలుచేసుకొని వచ్చారని నేనుకూడా అంటె ఎంత irresponsible గా వుంటుంది? ఒక level లో మనము కొంచెము ఆలోచించుకొని ఒక మార్గములో వెళ్ళాలికాని వారు సంతకాలు పెట్టియిస్తే అంతా పెద్ద మనుష్యులు ఇచ్చినట్లు వారు ఫలానా వూరికి ఇవ్వమని సంతకాలు పెట్టియిస్తే 50 వేలు రొక్కం జేబులో వేసుకొని వచ్చి యిచ్చినట్లు ఎంచడంలో ఎక్కడయినా న్యాయ ముంటుందా?

శ్రీ బి ఎల్లారెడ్డి ఏదయినా ఆధారము వుండాలికదా ఏ ఆధారము లేకపోతే ఎట్లా?

శ్రీ కె. వేంకటరావు వారి దృష్టిలోవున్న సూర్యారావుపేటకంటే ఇంకొకవూరికి ఇస్తే మంచిదని నేను అనుకోవచ్చు ఇంకా నల్గొండలో ఎవ్వరికీ ఇవ్వలేదు. 100 మంది వచ్చి అడిగితే 99 మందిని తొలగించి ఆ ఒక్కరికి ఇస్తే ఆ 99 మంది ఆధారము లేదని అంటారు. వాడు కూడ మనముపెట్టిన conditions కు నచ్చుతాడో లేడో చెప్పలేము అందుచేత friend అనేవాడు వుండడు. ఇది అంతా వారు చెప్పినట్లు కల్లుకు సంబంధించినదే. ఏ నిమిషములో ఏ రకముగా వస్తుందో నాకు తెలియదు

శ్రీ యస్ వి కె ప్రసాద్ చెట్లు ఎక్కువగా వున్నచోట యివ్వాలని వుందికదా

శ్రీ కె వెంకటరావు. చెట్లు ఎక్కువగా వున్నచోట యివ్వాలని నిర్ణయము లేదు. అడిగిన వారికి ఇవ్వాలని నిర్ణయములేదు తెలంగాణాలో నున్న పద్ధతి ఏమంటే

హైదరాబాద్‌లో చెట్లు అసలు లేనేలేవు హైదరాబాద్‌వారు కరీంనగర్ జిల్లాలో సుల్తానాబాద్ తాలూకాలో ఇస్తున్నారు

శ్రీ బి ఎల్లారెడ్డి హైదరాబాద్‌కు సిం. Society అవసరములేదు

శ్రీ కె వెంకటరావు మొన్నటివరకు మరట్వాడాలో ఇస్తున్నారు. చెట్లు ఉన్నచోటనే ఇవ్వాలనే నియమము ఎక్కడా పాటించలేదు ఈ experiment వల్ల గీతకార్మికులకు ఉపయోగము చేయాలని నా కోరిక గీత కార్మికులు అన్నిచోట్ల వున్నారు కొన్ని సిద్ధాంతాలను, కొన్ని administrative difficulties ను దృష్టిలో పెట్టుకొని centre select చేయబడుతుంది. కాని ఇంకొక కారణం ఏమీ లేదు దానికి extraneous influences ఏమీలేవు

శ్రీ బి. ఎల్లారెడ్డి ఇదయినా గీతకార్మికుల సంఖ్యను దృష్టిలో పెట్టుకొని చేస్తారా ?

శ్రీ కె. వెంకటరావు అది అయినా దానికితగ్గాగా వచ్చిన గీతకార్మికులు 4, 5 గురు వుంటారు ఒక్కొకరకము వారు న్నారు అనుకోండి ... యొక్క క్షేమం దృష్ట్యా చేస్తున్నాము. ఎవ్వరికో ఒక్కరి క్షేమం కొరకు చేయాల్సినదా ? అందరికీ క్రమముగా ఇవ్వాలి కదా !

శ్రీ బి. ఎల్లారెడ్డి - ఆ సంఖ్యను దృష్టిలో పెట్టుకొని అయినా చేస్తారా?

శ్రీ కె. వెంకటరావు - తప్పకుండా సంఖ్యను దృష్టిలో పెట్టుకొనే చేస్తాము. ఇదివరకు సంఖ్యలేదు కాబట్టి, ఇప్పుడు కంపల్సరీగా ఆ ఏరియాలో గీసే టటువంటి ప్రతివారు దానిలో మెంబరు అయితీరాలనే ప్రిన్సిపల్‌లేమన్ స్ట్రాంగ్‌గా పెడతామని చెప్పాను. వాళ్ళందరికీ లాభం కలిగించాలనే దృష్టితోనే ఆవిధంగా పెడతామని చెప్పాను. ఈ రిజొల్యూషను చాలా వైడ్‌గా ఉన్నది. ఇవాళే పార్టీజాలన్నీ పూర్తిగా మార్చియాలనే భావం యీ తీర్మానం స్ఫురింపచేస్తోంది. గవర్న మెంట్ యీ విషయమై ఎక్స్‌పెరిమెంట్ చేస్తున్నది. ఫస్ట్ ఎక్స్‌పెరిమెంట్ అయి, సెకండ్ ఎక్స్‌పెరిమెంట్ స్టేజ్‌లో ఉన్నాము సెకండ్ ఎక్స్‌పెరిమెంట్‌లో మనం సక్సెస్ అయితే, దీనిని ఇంకా చాలా వైడ్‌గా చేయాలని ఉన్నది అధికంగా చేయటానికి నాకు ఏవిధమైన అభ్యంతరములేదు. ఆ సొసైటీని జయప్రదం చేయటానికి సహకరించాలని కోరుతున్నాను. అక్కడ ఎకౌంట్స్ వ్రాసేవారు, ఆ వ్యవహారమంతా చూసుకొనేవారు గీతపారిశ్రామికులే. వారందరు తోడ్పడి, ఇది జయప్రదం చేసినట్లయితే ఇంకా దీనిని విస్తృతం చేయటానికి అభ్యంతరం ఉండదు. కాబట్టి యీ తీర్మానాన్ని ఉపసంహరించుకోవాల్సిందిగా ధర్మభిక్షం గారిని కోరుతున్నాను.

శ్రీ కె సుబ్బారావు (హిందుపూర్ జనరల్) – కన్స్యూమర్స్‌కు కూడ లాభం కలిగేటట్లు చూస్తారా? వచ్చిన లాభంలో వారికి కూడ పంచటానికి చూస్తారా?

• శ్రీ కె వెంకటరావు – ఏరోజున ఎవరికి దీనిపై అభిరుచి ఏర్పడితే వారు పోయి త్రాగివస్తుంటారు దారిన పోయేవారందరిని ఒక రిజిష్టరులో వ్రాయటం వీలులేదు, కనుక, వారికి అటువంటి లాభం కలుగజేయటం అసంభవమైన విషయము

శ్రీ కే. సుబ్బారావు – కన్స్యూమర్స్ కూడ మెంబర్స్‌గా ఉండవచ్చుని పెట్టవచ్చును

శ్రీ కె. వెంకటరావు – ఎవరో రహస్యంగా కాలక్షేపం చేస్తున్న వారిని బహిరంగంగా లిస్టులో పెట్టమంటారా? (నవ్వు)

ఒక గౌరవసభ్యుడు – రహస్యం అంటూ మనదేశంలో లేదండి. ఇక్కడ బహిరంగంగానే దుకాణాలు పెట్టుకొని అమ్ముకొంటున్నారు.

శ్రీ బి. ధర్మభిక్షం – అనేక మాస్ పిటీషన్సు మంత్రిగారి దగ్గరకు వచ్చాయి సూర్యాపేటనుండి 1,200 మంది సంతకాలు పెట్టి ఇచ్చారు 9 మంది శాసనసభ్యులు వచ్చిచెప్పారు కాని మంత్రిగారు వారిపక్షమున ఉన్న వారిమాటలకు ప్రాముఖ్యత ఇచ్చి, మాట్లాడారు. వారిప్రక్కన ఉన్న వారు చెప్పినదానిని అంగీకరించటం మంత్రిగారి పద్ధతాఅని ఉడుగుచున్నాను. మంత్రిగారు దీనికి ఏమీ జవాబు చెప్పలేదు. కాబట్టి నా తీర్మానమును ఓటుకు పెట్టవలసిందిగా కోరుతున్నాను.

*Mr Chairman* · The question is

"This Assembly recommends to the Government to discontinue the present system of giving excise contracts by auction and instead to form Tappers' Co-operative Societies in Telangana, and entrust the said work to the Societies"

The motion was negatived

*Sri B. Dharmabhiksham* · Sir, I demand a division

The House then divided

| Ayes | 31 | Noes | 69 |
|---|---|---|---|

The motion was negatived

## *Resolution re*
## *Extension of Educational Facilities to the poor*

శ్రీ బి. నరసింహమూర్తి - అధ్యక్షా, "షెడ్యూల్డ్ జాతులకు, వెనుకబడిన తెగలకు ఇప్పుడు ఇవ్వబడుతున్న విద్యా సౌకర్యములను, కుల మత విచక్షణ పాటించకుండా, రాష్ట్రములోవున్న పేద విద్యార్థు లందరకు విస్తరింప చేయుటకు సాధ్యమైనంత త్వరలో అవసరమైన చర్యలు తీసుకొన వలసినదిగా యీ విధానసభ ప్రభుత్వమునకు సిఫారసు చేయుచున్నారు" అనేటటువంటి యీ తీర్మానాన్ని నేను ప్రతిపాదిస్తున్నాను. మన దేశమునకు స్వాతంత్ర్యము లభ్యము కాకపూర్వము, మనము యొక్క దారిద్ర్యమునకు కారణము దేశములోని అవిద్య, అజ్ఞానము అని మన భారత జాతీయ కాంగ్రెసుకు అధ్వర్యం వహించి నడిపించిన మహాత్మా గాంధిగారు అన్నారు కాబట్టి మహాత్మగాంధీ ఆశయాల ననుసరించి, దేశంలో విద్యావ్యాప్తికై అధికంగా కృషి చేయవలసిన ఆవశ్యకతను, అవసరమును కాంగ్రెసుపార్టీ, తదితర రాజకీయ పార్టీలు ఎంతగానో గుర్తించినవి. మనకు స్వాతంత్ర్యము లభ్యమైనతర్వాత, కాంగ్రెసు పార్టీ ఆధ్వర్యమున ప్రభుత్వము నడుపబడుతున్నది మహాత్మాగాంధీ ఆశయమైన ప్రముఖమైన హరిజనోద్ధరణ, వెనుకబడిన జాతులయొక్క అభివృద్ధి ప్రధానలక్ష్యంగా పెట్టుకొని కాంగ్రెసు ప్రభుత్వం అనేక శాసనాల ద్వారా కార్యకలాపములుసాగిస్తూ హరిజన అభివృద్ధికి ఎంతగనో కృషి చేస్తున్నది. హరిజనులకు ఇళ్ళ స్థలములు ఇచ్చుట, ఉచిత విద్యాసౌకర్యములు కల్పించుట, ప్రత్యేకంగా ఉద్యోగ అవకాశములను కల్పించుట మొదలైన పనులు చేయుచున్నది. హరిజనులకు, వెనుకబడిన జాతులవారికి అనేక సౌకర్యములు కలుగజేయుటలో యీ ప్రభుత్వం చేస్తున్న కృషి చాలా ప్రశంసాపాత్రమైనది ఈ ప్రభుత్వం ఇంకా అధికంగా కృషి చేసి, యీ వెనుకబడిన జాతులవారికి, హరిజనులకు అనేక సౌకర్యాలు, సదుపాయాలు కల్పించాలని కోరుతున్నాను.

అందువల్ల ఈ నాడు ఈ తీర్మానమును ప్రతిపాదించడములో నా ఉద్దేశ్యమును వెలిబుచ్చదలచు కున్నాను. ఆర్థికముగా వెనుకబడివున్న హరిజనేతర కులాలవారి బిడ్డలు విద్యాభివృద్ధి చెందటానికి ఈషణ్మాత్రమైనను అవకాశములేదు. అందువల్ల వారందరు నిరక్షరాస్యులై, విద్య అనేది లేకుండా నిలచిపోవలసిన పరిస్థితి ఏర్పడు తున్నది అలాంటి కుటుంబములవారు మనదేశములో నూటికి 70 వంతులు ఉన్నారు. వారిబిడ్డలలోకూడ ఎంతో విజ్ఞానవంతులు కాగలవారు వున్నారు. అలాంటి వారికి విద్యాభివృద్ధి జరగటానికి అవకాశము లేకుండా పోవడము అనేది వారందరు ఈ పేద కుటుంబములలో జన్మించిన కారణముగా అవకాశములేకుండా పోవడమనేది దురదృష్ట కరమనే చెప్పాలి. అవకాశము లేకపోవడమువల్లనే వారందరు ఎన్నాళ్లుగడచినను అజ్ఞానులుగానే ఉండి పోవలసి వస్తున్నదని ప్రభుత్వము గుర్తించాలి. ఈ విషయము

ప్రభుత్వానికి తెలియనటువంటిది ఏమాత్రముకాదు పేదకులములలో పుట్టిన కారణము చేత, వారి విద్యకు అవకాశములేకుండా ఉన్నది హరిజనులకు సౌకర్యాలు కలిగించిన విధముగా హరిజనేతర పేదకులాలవారికికూడ అదేమాదిరి సదుపాయములు కలిగించడము కన్పించదు విద్య విషయములో అన్నికులములవారికి విద్యాసౌకర్యాలు సమానస్థాయిలో కలుగజేస్తూ ముఖ్యముగ పేదకులములలో పుట్టిన విద్యార్థులనుకూడ అర్హతగలవారినిగా విజ్ఞానవంతులుగ చేయాలని మనవిచేస్తున్నాను ఈవిషయములో హరిజనులకు యిచ్చే సౌకర్యములు హరిజనేతర కులములకుకూడ కలుగజేయటానికి ప్రభుత్వం ఇంతవరకు ఏలాంటి చర్యతీసుకోలేదు. ఇంకను ప్రభుత్వము తగుచర్య తీసుకోకుండా ఉపేక్షించినట్లైతే, ఇంతకుమరిన్ని రెట్లుగా హరిజనేతర కులాలలో అజ్ఞానము విపరీతముగ పెరిగిపోకతప్పదు మనదేశములో ప్రభుత్వము సౌకర్యాలను కలుగజేయటానికి మిన్నకుండా వుండేటట్లైతే, ప్రపంచములోకల్లా మనదేశమే ఎక్కువ అజ్ఞానముతోకూడిన దేశముగావుండిపోకతప్పదు మనదేశములో ఏదోకొద్ది కుటుంబములకుతప్ప, విద్యాభివృద్ధిద్వారా విజ్ఞానవంతులు, ప్రవీణులు అయినవారు కొద్దిమందే వుంటున్నారు మనదేశములో విద్యాసౌకర్యాలు అన్నికులములవారికి కలిగేటట్లు ప్రభుత్వము తగుచర్యతీసుకుంటే విజ్ఞానవంతులసంఖ్య తప్పక పెరుగుతుంది మనది పేదదేశము అనిచెప్పుకునేవాడుక, దానికితోడుగ అజ్ఞానమునుకూడ ప్రబలంజేసుకునేదానికంటె, ఆపరిస్థితినుంచితప్పించుకొనిబయిటపడివిజ్ఞానమునుసంపాదించుకోటానికి ప్రభుత్వం తగుచేయూతనివ్వాలి అంతేకాకుండా పేదకులములో జన్మించినంత మాత్రముచేత, ఆకుటుంబములలోని విద్యార్థులకు కావలసిన సదుపాయములు దొరకకపోవటము విచారకరమైన విషయము ధనవంతులుగానున్నవారు ఏదోవిధముగా తమయొక్క ధనమును ఖర్చుచేసి అయినను తమబిడ్డలకు స్వేచ్ఛగా చదువుచెప్పించుకునే అవకాశము వున్నది పేదవారికి ధనము లేకపోవడముచేత, అదిఒక ప్రతిబంధకముగాఏర్పడి, వారి బిడ్డలకు విద్యనేర్పుకునే అవకాశమే లేకుండావున్నది. అలాంటివారి విషయములో ప్రభుత్వం శ్రద్ధతీసుకోవాలని నాఅభిప్రాయము ఆవిధముగ ధనము వ్యయపరచి అయినను తమబిడ్డలకు చదువు చెప్పించుకునే శక్తిగలవారు నూటికి పదిమందికంటే ఎక్కువ లేరు. ఈవిషయము మనకిందరికీ తెలుసును తమబిడ్డలను విజ్ఞానవంతులుగా తయారు చేసుకోవాలి అని ఉల్లాసపడేవారు పేదకులాలలో నూటికి అరవైమందిదాకా వుంటారు. వారికి విద్యాసౌకర్యాలు కలుగజేయక పోవడము, ప్రభుత్వం తగుచర్య తీసుకోక పోవ మనదేశమునకు చా దాయకముగా పరిణమించుతున్నదని చెబుతున్నాను

తరువాత, కుల, మత తత్వరహితమైనటువంటి సమాజనిర్మాణమే మన ప్రభుత్వం యొక్క ప్రధానలక్ష్యమని ప్రజలలో ప్రభుత్వమువారు ప్రచారము చేస్తున్నారు. కాని ఆవిధముగ చెబుతున్నపుడు హరిజనులతోపాటు హరిజనేతర కుటుంబములకు కూడ

సమానస్థాయిలో విద్యాసౌకర్యాలు చేయకపోవడంవల్ల కులతత్వం పెరగడము, ఉత్సాహవంతులకు తగిన విద్యాసౌకర్యాలద్వారా విద్యలేకపోవడము నిజముగ విజ్ఞానవంతులు కాగలవారికి అవకాశము లేకపోవడము కనబడుతున్నది దీనివల్ల కులతత్వ నిర్మూలనకు అవకాశమే లేదు ఇంతకుముందు III Form వరకు ఉచిత విద్యాసౌకర్యాలు, హరిజనులకు, వెనుకబడినజాతులకు ప్రభుత్వం కలుగజేశారు కాని మిగిలిన సామాన్య పేదకుటుంబాలకు చేయలేదు ఈతీర్మానమును సభవారు ఆమోదిస్తారని ఆశిస్తూ ప్రవేశ పెట్టియున్నాను ఈతీర్మానముఆమోదించినట్లైతే, ప్రభుత్వానికి మరింతఖర్చు ఎక్కువ అవుతుందేమోనని అనుకోవచ్చు అధికముగ ధనము విద్యకొరకు ఖర్చుచేయవలసి వుంటే, దానికి నేను ఒకసూచనఇవ్వదలచుకున్నాను ప్రభుత్వోద్యోగులలోకాని, ఇతర వ్యాపార రంగములోగాని, జీతాలు, లాభములు వేలకొలది సంపాదించుకునే వారు అనేకులు ఉన్నారు ప్రభుత్వం విద్యానిధి అని ఒకట ఏర్పాటుచేస్తూ విద్యావంతుల వద్దనుంచి, విద్యాభిమానులు, ఉదారవంతుల వద్దనుంచి కాకుండా, ప్రభుత్వోద్యోగస్థులనుంచి యీనిధిని వసూలుచేసినట్లైతే, తద్వారా కొంతసొమ్ము సేకరించటానికి అవకాశము ఉంటుంది ఆనిధితో విద్యనేర్చుకోవాలనే ఉత్సాహవంతులకు సహాయము చేసినట్లైతే నిరక్షరాశ్యలి తప్పక తగ్గిపోతుందని నానమ్మకము ఈనిధిని నిరంతరాయముగ ఏర్పాటుచెయవచ్చు ప్రభుత్వములోను మనదేశములోను అనుభవజ్ఞులైన విద్యావంతులు ఎంతోమంది ఉన్నారు వారినందరినీ యీనిధి ఏర్పాటును గురించి సంప్రదించి దీనికి ఒక పథకము తయారుచేసి అమలు పరచినట్లైతే, ప్రభుత్వానికి అధిక వ్యయము వుండదు. విద్యనేర్చుకునే ఉత్సాహవంతులకు విద్యాసౌకర్యాలు కలుగుతాయి ఆ మూలముగ ఈతీర్మానముయొక్క ఉద్దేశ్యముకూడ తప్పక నెరవేరగలదని నా నమ్మకము. అందువల్ల యీతీర్మానమును ఆమోదించ వలసిందిగా కోరుతున్నాను.

Sir, I beg to move

"This Assembly recommends to the Government to take necessary steps as early as possible to extend the Educational Concessions now given to the members of the Scheduled Castes, to the poor members of the other communities also irrespective of Caste, Creed and Religion"

*Mr Chairman* Motion moved

శ్రీ పి రాజగోపాలనాయుడు, అధ్యక్షా, విద్యా విషయకంగా నేను శ్రీ మేడూరు నాగేశ్వరరావుగారు కూడ మాట్లాడి యున్నాము. ప్రస్తుతము అనుచిత వర్ణాలకు ప్రభుత్వము విద్యా సౌకర్యాల కొరకు ఇస్తున్నటువంటి గ్రాంట్లు చాలా తక్కువగవున్నవి ఇవి పెంపు చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. ఈ సౌకర్యములు అందరికీ దొరకడములేదు. విద్య నేర్చుకోవాలనే ఆసక్తిగలవారికి

కోరిన విధముగ సౌకర్యాలు లభించకపోవడంవల్ల విద్య రాకుండా అజ్ఞానంలోనే ఉంటున్నారు ఇప్పుడు ఇస్తున్న గ్రాంట్ల పరిమితిని మించి యివ్వవలసి ఉంటుంది ఇదిగాక గ్రాంట్లను ఇచ్చే తేదీ కూడా మార్చవలసి ఉంటుంది హరిజనులు, వెనుక బడిన జాతులతో పాటు ఇతర పేద కులములవారికి కూడ సమాన స్థాయిలో విద్యా సౌకర్యాలు సమకూరేటట్లు ప్రభుత్వం తగు శ్రద్ధ వహించాలి. వారికి విద్య లభించక చిక్కులు ఏర్పడినవి చదువు కావాలని ఆసక్తితో ఉన్న విద్యార్థులు నూటికి నూరు పాళ్లు విద్యా సౌకర్యాలు లేక బాధపడుతున్నారు అలాంటి వారు పేదకులములలో ఉండడంవల్ల వారికి ప్రోత్సాహము కనబడడములేదు అందువల్ల వారికి చదువు రాని వారుగానే ఉండిపోతున్నారు ధనవంతులు ధనము వ్యయపరచి విద్యను తమ బిడ్డ లకు నేర్పుకోగలుగుతున్నారు గాని పేదవారైఉన్న కుటుంబాలు సౌకర్యములు లేని కారణంచేత తమ బిడ్డలను దూర ప్రాంతాలకు పంపుకోలేని పరిస్థితిలో ఉన్నారు వారికి ఏ విధముగా నైనను సౌకర్యాలు కలుగజేయటానికి బాధ్యత ప్రభుత్వమే వహించాలి దీనికి తగిన ప్రాతిపదికలు ప్రభుత్వము ఏర్పాటు చేసి అమలు పరచాలి అందులో ముఖ్యంగా మొదటిది merit విద్యార్థుల నైపుణ్యమును అనుసరించి సౌక ర్యాలు కలుగ చేయాలి. ఈ తీర్మానము ఆమోదించినట్లైతే రాష్ట్రములో ఉనని పేద కుటుంబములలోని బిడ్డలందరికీ తప్పనిసరిగా సౌకర్యాలు లభించే అవకాశము ఉంటుంది విద్య నేర్చుకోవాలనే నిర్బంధం ప్రతివాడిమీద లేకపోయినను ప్రభు త్వము కొంతవరకు బాధ్యత వహించినట్లైతే అజ్ఞానమును పోగొట్టే అవకాశం కలుగు తుంది . ఈ ప్రయత్నము ప్రభుత్వం తప్పనిసరిగా చేయాలి పేద కుటుంబములలో ఉన్నవాళ్లను ఎంతోమందిని విజ్ఞానవంతులనుగా చేయవచ్చు అందరికీ సరిసమాన సౌక ర్యాలు కలుగ జేస్తే సోషలిస్టు సమాజ నిర్మాణమునకు దోహదము కలుగజేసి నట్లవుతుంది పేద కులములలోని వారి బిడ్డలనుకూడా విలువఅయినంతమందిని ప్రతిభా వంతులుగ చేయాలని ప్రభుత్వము ప్రధాన లక్ష్యముగా పెట్టుకోవాలని నా అభిప్రాయము

ఇదిగాక ఈనాడు వర్ణాంతర వివాహములను చేసుకొన్న కుటుంబాలు ఎన్నో ఉంటున్నవి ఈ వివాహములు కుల మత తత్వములను పోగొట్టుతున్నవి గనుక అలాంటి వర్ణాంతర కుటుంబాలలోని బిడ్డలనుకూడ ప్రోత్సహించాలి వారికి first priority ఇవ్వడము మంచిది రాష్ట్రములో వర్ణమతభేదములు పోగొట్టాలని ప్రభుత్వం అనుకుంటున్నప్పుడు వరాంతర కుటుంబాలు వారి బిడ్డలకు తగిన విద్యా సౌకర్యాలు కలుగజేయడమనేది ప్రభుత్వం ప్రదానలక్ష్యముగా పెట్టుకొని first priority ఇచ్చే టట్లయితే, వర్ణ భేదాలు పూర్తిగా నశించిపోయే అవకాశము తప్పక చేకూరుతుంది అందువల్ల యీ రెండు ప్రాతిపదికలమీద విద్యను నేర్పించే ఏర్పాటు ప్రభుత్వం

చెస్తే ఈ కుటుంబాలలో ఆర్థిక సంపత్తుకూడ పెంపొందచేయవచ్చు ఈ కారణములు దృష్టిలో పెట్టుకొని యీ తీర్మానమును ఆమోదించవలసినదిగా కోరుతూ ముగిస్తున్నాను

శ్రీ బి. రామారెడ్డి [మైదుకూరు] అధ్యక్షా, నరసింహామూర్తిగారు విశాల దృక్పథంతో ఆలోచన చేసి యీ resolution తెచ్చినట్లుగా నాకు తోస్తోంది. ఆహారం ఎంత ముఖ్యమో ప్రజానీకానికి ఇప్పటి యీ నాగరికతా ప్రపంచంలో విద్య కూడ అంతముఖ్యం సభ్యత్వ దేశాలలోకల్లా మన దేశం నాగరికత విషయంలోచాలా వెనుకబడి ఉన్నదని, విద్య విషయంలో చాలా వెనకబడి ఉన్నదని మనం పదే పదే అనుకుంటున్నాం అందుచేతనే వెనుకబడిన జాతులవారు ధనాభావం చేత విద్య నేర్చుకోడానికి అవకాశం లేదు కష్టపడుతున్నారు అనే ఉద్దేశ్యం చేతనే వారికి తగునైన సౌకర్యాలు కల్పించినారు అలా కల్పించడంలో చాలా దూరం పోయినారని నేను చెప్పుతున్నాను దానివల్ల ఒకవిధమైన కష్టం కూడ కలుగుతోంది హరిజనులకు, Scheduled జాతుల వారికి విద్య విషయంలో అర్హతల గురించి ఒకవిధమైన మినహాయింపులు ఇస్తూ వచ్చారు ఇతరులకు 60, 70 మార్కులు రావలసి ఉంటే హరిజనుల వగైరాలకు 40 మార్కులు వస్తేచాలు అని పెట్టారు ఇది ఒక విధంగా మంచిదే కాని హరిజనులు "మనకు 40 మార్కులు వస్తే చాలు మనకు ఉద్యోగాలు వస్తాయి" అనే ఉద్దేశ్యములో వారు ఉన్నారు కాబట్టి 60 మార్కులు తెచ్చుకుంటేనే ఉద్యోగము లభిస్తుందనేదిలేకుండా 40 మార్కులుచాలును అంటే వాళ్లను సోమరిపోతులుగా చెసే దానికి యిది ఉపయోగపడుతుందని నాభావం ఏ సంస్కరణలైనా హెచ్చుతగ్గులు వేయకూడదు. సాధారణంగా రైతాంగంలో ఏకొద్దిమందో తప్ప మిగతా వారందరుకూడ సామాన్య రైతుకుటుంబీకులు రైతుకూలీలు, బీదవారు వారు సవర్ణులలో జన్మించారనే పాపం చేతను, ఒకవిధమైన ధనికులు అనే భావం చేతను వారికి ఏ విధమైనటువంటి సౌకర్యాలు కలిగించకుండా ఉండటం ప్రభుత్వానికి ధర్మం కాదు కేవలం ధనాభావం చేతనే చెయడంలేదని అనుకోడానికి వీలు లేదు సత్కార్యాచరణలో యీ ప్రభుత్వం ధనాభావాన్ని లెక్క చెయ్యదు అనేదానికి ఉదాహరణగా ఎన్నో కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి ఖజానాకు నష్టం తెచ్చుకొని ప్రజానీకానికి, యితర బీద కుటుంబాలకు కష్టంగా ఉన్నదని మద్యపాన నిషేదాన్ని ప్రవేశపెట్టినారు. ఇంత ఉదార బుద్ధితో సత్కార్యాలకు ధనం ఒక అడ్డంకుగా లేకుండా చేసిన ప్రభుత్వం సర్వప్రజానీకము విద్యను పొందగలిగే హక్కును కల్పించాలని నా కోరిక మిత్రుడు రాజగోపాలనాయుడుగారు వర్ణాంతర వివాహాలు చేసుకొన్న వారికి యీ సౌకర్యాలు కలుగ చేస్తామనే ఎలు ఒకటిపెట్టమన్నారు అది పూర్వం మన దేశంలో Christians చేసిన చెడ్డపని అని చెప్పుతున్నాను వర్ణాంతర వివాహం అనేది మనస్ఫూర్తిగా వారు ఒప్పి చేసుకుంటే బాగుంటుంది కాని

“ బలవంత బ్రాహ్మణార్థం ” మాదిరిగా విద్య చెప్పిస్తామని బీదవానికి వర్ణాంతర వివాహంచేస్తే అటువంటి దాంపత్యం ఏ విధమైనటువంటి సౌఖ్యాన్ని కలుగచేయదు కాబట్టి దానికి దీనికి ముడి పెట్టడం సమంజసం కాదు

విద్య వస్తూ ఉంటే నాగరికతా ప్రపంచములో వర్ణాంతర వివాహాలు వాటికి అవే జరుగుతూ ఉంటాయి కాబట్టి పేద విద్యార్థులకు విద్య చెప్పిస్తాము వర్ణాంతర వివాహాలు చేసుకోమని చెప్పడం మంచిదికాదని నేను వారికి సలహా యిస్తూ ప్రభుత్వానికి మీద్వారా మనవి చేసుకొంటున్నాను బ్రాహ్మణులు, వైశ్యులు, సవర్ణ హిందువులు అని పిలువబడేవారు, ప్రతివారిలో కూడ 100 కి 50 మంది పైనే బీదవారు ఉన్నారనే విషయం ఆంధ్ర దేశంలో అందరికి తెలిసినదే రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో రత్నాలు ఎన్నో ఉన్నాయి వాటిని సాన పెట్టితే ఎట్లా ప్రకాశిస్తాయో, అట్లాగే బీద విద్యార్థులందరికి సరైన సౌకర్యాలుకల్పించి విద్య చెప్పించి భావి భారత పౌరులుగా తయారు చెయవలసినటువంటి బాధ్యత ప్రభుత్వము మీద ఉన్నది అటువంటివారికి సహాయపడి వారిని విద్యావంతులుగా చేయవలయునని కోరుతున్నాను వర్ణ వివక్షత లేకుండా ఎవరైతే బీద విద్యార్థిగా ఉంటాడో సవర్ణ హిందువుడైనప్పటికి కూడ హరిజనుల మాదిరి విద్యా సౌకర్యాలు కల్పించవలెనని ప్రభుత్వానికి మీద్వారా మనవిచేసుకొంటున్నాను

శ్రీమతి సి. అమ్మన్నరాజా (అత్తిలి) అధ్యక్షా, ఈ విషయం నా మనస్సులో చాలకాలంగా ఉన్నది. మన గవర్నమెంటు మద్రాసులో ఉన్నప్పుడు బీదగా ఉన్న కులాలవారందరిని Backward Communities జాబితాలో చేసి అయినా వాళ్లకు సౌకర్యాలను కల్పించమని చెప్పినప్పుడు గోపాలరెడ్డిగారు “ మీది ఎట్లా Backward Community అవుతుంది ? శ్రీ సర్ కూర్మారెడ్డినాయుడుగారు ఉన్నది Backward Community అవుతుందా” అని అన్నారు “One swallow does not make a summer” అన్నట్లుగా ఎవరో సర్ కూర్మారెడ్డినాయుడుగారు గవర్నరు అయినంత మాత్రంచేత ఆకులం అంతా forward అనడానికి వీలులేదు కాబట్టి కులాన్ని అనుసరించికాక బీదతనాన్ని అనుసరించి విద్యాసౌకర్యాలు కలుగచేయాలి “ భూమి దాహం ” అన్నట్లుగానే విద్యా దాహం ఉన్నవాళ్ళు అనేకమంది ఈసౌకర్యాలు లేక బాధపడుతున్నారు కొంతమందికి వేరే వృత్తులుకూడ చేతకావు ఏదో ఉద్యోగాలరికే చేసుకో గలుగుతారు కాని మిగిలిన వృత్తులన్ని చేతకావు చేస్తే ఉద్యోగం చేయాలి లేకపోతే ఏమీలేదు అటువంటివాళ్ళు ఎంతోమంది బీదరికంతో బాధపడుతున్నారు ఇదివరకు ఎప్పుడూ నేను urban constituency కి representative గా ఉండేదాన్ని ఈ సారిమాత్రం rural constituency కి representative గా ఉన్నాను ఇప్పుడు నాకు బాగా తెలుసు పెద్దకులాలు అనుకున్నవాళ్లలో ఎంత బీదరికం ఉన్నదో, ఎంత బాధ పడుతున్నారో, చదువులు లేక ఎంత వెనుకబడి

ఉన్నారో మాత్రం తెలుస్తుంది Cooly class అని పెట్టండి ఒక్క హరిజనులే కూలీలు అనుకుంటున్నారు కానేకాదు కూలికి రెడ్లు వెడుతున్నారు. కాపులు వెడుతున్నారు. కమ్మవారిలో అంతగా ఉన్నదని నేను అనుకోవడంలేదు (Interruption) నాకు తెలియదు రెడ్లు, కాపులు, విశ్వ ఊద్పులకు, కోతలకు వెళ్లి పనిచేస్తూ ఉండడం నేను చూచాను వీళ్ళందరిని పెద్దకులాలు అని చెప్పి వాళ్ళకు ఈ సౌకర్యాలు లేకుండా చెయడం చాల అన్యాయమైన విషయం విద్య అందరికి అందుబాటులో ఉండేటట్లు చెయడం ప్రభుత్వంయొక్క కనీసధర్మం

మార్కుల difference ఒకటి ఉన్నది ఈసారి నేనుకూడ అనుభవించాను విశాఖపట్టణం జిల్లాలో పెద్ద ఉద్యోగస్థుల బిడ్డలైనప్పటికి జిల్లా అర్హతవల్ల వాళ్లకు సీట్లు వస్తాయి కనీసమార్కులు రాకపోయినప్పటికీ కులం, జిల్లా, ప్రాంతం ఈపద్ధతులన్నీ re-caste చెయాలని నేను సంజీవరెడ్డిగారికి మనవిచేశాను ఇదివరకు ఎన్నడు చదివి ఉద్యోగాలు ఎరగనివాళ్ళకయితే concession అంటే దానిలో న్యాయం ఉన్నది తరతరాలనుంచి చదువుకొని ఉద్యోగాలు చేస్తున్న కుటుంబాలకు కూడ విద్యా సౌకర్యాలు యిస్తున్నారు 'Strictly to the point' మాట్లాడటంలేదు. కాని యిలాంటి భేదాలు చాల ఉన్నాయి కాబట్టి చాల బీదరికంగా ఉన్నవారికి scholarship యిచ్చి చదివించడం చాల ధర్మం Madras లో నేను వావిళ్ళవారి shop కు వెళ్ళినప్పుడు అక్కడకు కాపీనం దరించి 8 ఏళ్ల బ్రాహ్మణకుఱ్ఱవాడు ఒకడు అమరం పుస్తకం కొనుక్కోవాలని వచ్చాడు దాని ఖరీదు $1\frac{1}{2}$ అ. ఆ పైసలుకూడ అతనిదగ్గరలేవు అణాడబ్బులు లేకన్నా అమరం పుస్తకం కొని చదువుకోవాలన్న ఆశ అతనిలో ఉన్నది కాని అవకాశంలేదు ఎవరో చూచినవాళ్ళు ఆ పైసలుయిస్తే ఆ పుస్తకం కొనుక్కొని చదువుకన్నాడు తినడానికి తిండి లేకపోయినప్పటికీ చదువుకోవాలనే ఆశ ఉన్నవాళ్లకు అవకాశాలు కలుగచెయకుండా చదువు అంటే ఏ మాత్రం శ్రద్ధలేక, పైకి వచ్చే అవకాశాలు లేకపోయినప్పటికీ వాళ్ళకు సౌకర్యాలు కలిగిస్తూ ఉండటం, వాళ్లను పైకి తీసుకురావాలనే ఉద్దేశ్యంతో అయినప్పటికి మిగిలిన వాళ్ళకు కూడా సమానమైన సౌకర్యాలు ఇవ్వవలని ఉంటుంది కాబట్టి బీదరికాన్ని ప్రాతిపదికగా తీసుకోవాలి "వాళ్ళు ఏదో హరిజనులట. వాళ్ళ నాన్నగారు పెద్ద Gazetted Officer అయినప్పటికీ వాళ్లకు scholarships ఉంటాయి బీదవాళ్లైనప్పటికీ యితరుల వాళ్లకు ఏమి లేవు" అని పిల్లలు చెప్పుకోవడం College లలో, School లలో వింటూ ఉన్నాము హరిజనులకు కావలసినన్ని యిచ్చుకోండి కాని ఇతర బీద వాళ్లకు కూడ ఈ సౌకర్యాలు కల్పించి ఈ అన్యాయాన్ని తొలగింపచేయడానికి Government శ్రద్ధగా పూనుకొని Central Government కూడ దీనికి సహాయపడేలాగ recommend చేసి ఈ అన్యాయాలను తొలగించాలని కోరుతూ దీనిని ఒప్పుకోవాలని కళా వెంకటరావుగారికి విజ్ఞప్తి చేస్తున్నాను

శ్రీ సిహెచ్. రాజేశ్వరరావు (చోప్పదండి) అధ్యక్షా, నేను ఈతీర్మానమును బలపరుస్తున్నాను పేద విద్యార్థులు ఏ వర్ణానికి చెందినవారైనా, వారు ఎక్కడ వున్నా కూడా ప్రభుత్వం తరఫునుంచి సహకారం లభించడం అనేది ముఖ్యమైన విషయం హరిజనులకు, వెనుకబడిన తరగతులవారికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలనే నిర్ణయం భారతరాజ్యాంగంలోనే ఉన్నది కాబట్టి అది ఆచరణలో సాగుతోంది దాని ఆచరణలోకూడా కొన్నికొన్ని ప్రాంతాలలో అక్రమాలు జరుగుతున్నట్లు తెలుస్తున్నది. ఆర్థిక పరిస్థితులు బాగుగావుండి, తమ బిడ్డలను చక్కగా చదివించుకొనగల శక్తి గలవారుకూడా స్కాలర్‌షిప్స్‌కోసం ప్రయత్నిస్తున్నారు పెద్ద ఉద్యోగములలో ఉన్నవారు, ఇతరమైన పెద్ద ఆదాయములు గలవారు కూడా వారిబిడ్డలకు స్కాలర్‌షిప్పులు పొందుతున్నారని రిపోర్టులు ఉన్నాయి అది వాస్తవమే, ఏమీ సందేహము లేదు వారు హరిజనులయినా, వెనుకబడినవారు అయినా, బిడ్డలను చదివించుకొనుటకు చక్కని అవకాశం ఉన్నప్పటికీ కూడా, ప్రభుత్వంచే ఇతర పేద విద్యార్థులకు చెందవలసిన డబ్బును తీసుకోవడం అనేది సరైనదికాదు దీనిని తప్పకుండా (చెక్ అప్) పరిశీలన చేయాలి. ఇదివరకు ఉన్న check up లో ఏమైనా బలహీనత వుంటే, దానిని తొలగించి ఇప్పుడు strict గా enforce అయ్యేటట్లు చూడాలని కోరుతున్నాను మిగతా వర్ణాలను గురించి చాలామంది మిత్రులు మాట్లాడినారు బ్రాహ్మణులుగాని, రెడ్లుగాని—ఏ వర్ణానికి చెందినవారైనప్పటికీ, పేదవారు ఉంటూనే ఉంటారు తమ బిడ్డలకు చదువు చెప్పించుకొనగల స్థితిలో చాలామంది లేరు పెద్దవారు పట్టణాలకు వెళ్ళినప్పుడు మీరు ఎవరు అని ఎవరైనా అడిగితే రెడ్డి అనో, రావు అనో చెప్పుకోవడం జరుగుతోంది దీనిని బట్టి రావు, రెడ్డి అంటే వారు ఆస్తి కలిగినవారు అనుకోవడం తటస్థిస్తోంది దీనిని తొలగించవలసి యున్నది. పేదవారు ఏ వర్ణానికి చెందినవారైనప్పటికినీ తప్పక సహాయం చేయాలి నిజంగా పేదవాడు అనే విషయం ప్రభుత్వమునకు, ఇన్‌స్టిట్యూషన్‌కు తెలిసినట్లయితే ఆ పేద విద్యార్థికి తగు విధంగా స్కాలర్‌షిప్ ఇవ్వడానికి అవకాశం ఉంటుంది పేద విద్యార్థులలో చాలామంది మంచి చురుకుగా చదివి మంచి మార్కులతో ఉత్తీర్ణులయేవారున్నారు. ఇటువంటి విద్యార్థులు అసెంబ్లీ సభ్యుల క్వార్టర్సులో అప్పుడప్పుడు మమ్మలను కలుస్తూ ఉంటారు. వారందరికి సహాయం చేయడానికి ప్రభుత్వంయొక్క ఇప్పుడున్న పాలసీలో ఎక్కువ అవకాశాలు లేవు హరిజనులకు, వెనుకబడిన వారికి ప్రత్యేకించబడిన సౌకర్యములు ఉండనే ఉన్నాయి ధనాభావం అయినప్పటికినీ, ప్రభుత్వం అంతమాత్రమునకే పరిమితం చేయకుండా ఇతర కులములలోని పేద విద్యార్థులకు కూడా స్కాలర్‌షిప్‌ల రీత్యా తగు సహాయం, సౌకర్యం చేయించాలని కోరుతున్నాను అట్లా చేసేటట్లయితే విద్యా విధానాన్ని అభివృద్ధి చేయడమే కాకుండా, విద్యార్థులను ప్రోత్సహించినవారమవుతా

మని, ప్రభుత్వం యీ సూచనను బాధ్యతగా గుర్తించి సాధ్యమైనంతవరకూ సహాయం చేయాలని కోరుతూ యీ తీర్మానాన్ని బలపరుస్తూ, నేను విరమిస్తున్నాను

మిస్టర్ చైర్మన్ ఇంక మంత్రిగారిని మాట్లాడమని అడుగుతున్నాను.

శ్రీ ఎల్. లక్ష్మణదాస్ (పాతపట్నం, జనరల్) అధ్యక్షా, ఇది చాలా ముఖ్యమైన తీర్మానం ఈ వేళ ఇన్ని తీర్మానములు పూర్తి కావలెను అని ఎక్కడా ప్రొసీజరు లేదు కాబట్టి, దీనిమీద మరికొంత సేపు చర్చ సాగించినట్లయితే అందరి అభిప్రాయాలు తెలుకో డానికి నిలుంటుంది

మిస్టర్ చైర్మన్ ఇప్పుడు ఈ తీర్మానంమీద చర్చ అంటూ ఏమీ జరుగుట లేదు అందరు ఏకీభవిస్తూనే మాట్లాడుతున్నారు విభేదించేవారెవ్వరు లేరు. మంత్రిగారు మాట్లాడతారు ఒహుశా, వారుకూడా ఏకీభవించగలరేమో నిరీక్షించవలసియున్నది. కాబట్టి, దీనిమీద ఎక్కువ చర్చచేయవలసిన అవసరంలేదు

*Sri. E Ayyapu Reddi* There are various aspects of the resolution Sir It is not a question whether there are differences of opinions or not Each member is trying to bring to light some aspect of that resolution Please permit 10 or 15 minutes more for discussion

*Mr Chairman* Each Member has been saying the same thing There is no new contribution If hon Members can co-operate we can stop this discussion and let the hon Minister reply

*Sri E Ayyapu Reddi* There are 3 or 4 Members who want to speak on this resolution. I request that we may be given atleast 2 or 3 minutes to speak

*Mr Chairman* I have no objection, if that is the sense of the House

*Sri L Laksmana Das* . The House is in favour of having discussion for some time more At least the sense of the House is not in favour of closure I would therefore request you to allow us to speak

*Mr Chairman* I now call upon Sri L. Lakshmana Das to speak.

శ్రీ ఎల్. లక్ష్మణదాస్ అధ్యక్షా, ఇప్పుడు ఈ తీర్మానం చదివితే చాలా ఆమోదయోగ్యంగా, ఆచరణయోగ్యంగా, అందరికీ ఇష్టం ఉన్నట్లుగా కనిపిస్తోంది. కాని, ఇది ఎంతవరకు సాధ్యం అనే విషయం ఆలోచించాలి ప్రస్తుత విద్యావిదనం ఎంతవరకు పనికివస్తున్నది, ఆ విద్య ఎంతవరకు ఉపయోగపడుతున్నది అనే విషయం ముందుగా తెలుసుకొనవలయునని నేను సభ్యులనందరినీ కోరుతున్నాను ఏమైనప్పటికీ, ఈ నాడు కల్పిస్తున్న విద్య కేవలం ఉద్యోగాలకు సంబంధించినదే అని స్పష్టం అవుతున్నది మా తాలూకాలో హైస్కూలులేదు ఈ నాడు హైస్కూల్సులో చదువుతున్న విద్యార్థులందరు ఉద్యోగాలకోసమే ప్రయత్నాలు చేస్తున్నారు కాని ఇతర వృత్తులపట్ల వారు ఆసక్తి చూపుటలేదు మన ప్రజాస్వామిక దేశంలో ముఖ్యంగా విద్య అవసరం ప్రభుత్వం ప్రతి ఒక్కరికి విద్య ఇవ్వాలి అందరికి కూడా ఫ్రీ ఎడ్యుకేషన్ ఇవ్వాలి ఆ ఫ్రీ ఎడ్యుకేషన్ ఎంతవరకు ఇవ్వాలి? ఎంతవరకు సాధ్యమైతే అంతవరకు ఇవ్వాలి అనేదాంట్లో ఏ విధమైన భేదాభిప్రాయములు లేవు అందరికీ విద్య నేర్పాలి కాని, ప్రస్తుత విధ్యావిధానం అటువంటిది అవునా కాదా, అనేది పరిశీలించాలి ప్రస్తుతమున్న విద్యావిధానమును గురించి కొంత వ్యతిరేకత ఉన్నది. సంస్కరణలు తేవాలనే అభిప్రాయం ఉన్నది మన విద్యావిధానములో వ్యవసాయానికి సంబంధించిన వృత్తి విద్యలను ఎంతవరకు అభివృద్ధి చేసుకున్నాము? 3వ ఫారం వరకు చదువుకున్న తరువాత వ్యవసాయాన్ని అభివృద్ధి చేసుకునే విధంగా విద్య నేర్పుటకు ఏమి అవకాశములను కలిగించినామని అడుగుతున్నాము. అన్ని వృత్తులవారికి అన్నిరకాల వృత్తి విద్యలనూ నేర్పవలసియున్నది. చదువు పూర్తి అయిన తరువాత ఉద్యోగంతో సంబంధం లేకుండా, వారు నేర్చుకున్న వృత్తి విద్యలనుబట్టి వృత్తులు చేసుకొని జీవించే అవకాశం కల్పించిననాడే అది సరైన విద్య అవుతుంది విద్య అందరికి ఇవ్వాలి అనే విషయంలో ఎవ్వరికీ భేదాభిప్రాయాలు లేవు ఈ తీర్మానం నిజంగా ఆచరణయోగ్యమే. కాని ఆచరణకు అవకాశం లేదు ఈ నాడు ఫ్రీ ఎడ్యుకేషన్ హరిజనులకు, గిరిజనులకు ఇచ్చినంత మాత్రముననే రాష్ట్రంలో కొన్ని కోట్లరూపాయలు ఖర్చు అవుతున్నది అయితే, దేశంలో బీదతనం ఎంతవరకు ఉన్నది? దేశంలో నూటికి 90 మంది బీదవారే ఉన్నారు దీనిని బట్టి బీదవారందరికి ఉచితవిద్య గరపాలంటే దాదాపు అందరికీ ఉచితవిద్య ఇవ్వవలసి వుంటుంది అందువల్ల మన విద్యావిధానాన్నే పూర్తిగా మార్చాలి ఫీజు లేకుండా ఎంతవరకు అవకాశం ఉంటే అంతవరకు అందరికీ ఉచితవిద్య ఇవ్వవలసి యున్నది. ప్రభుత్వ అభిప్రాయం కూడా అదే. ఆశయం మంచిదే కాని ఆచరణలో పెట్టడానికి పరిస్థితులు అనుకూలించుటలేదు తగు విధంగా విద్యావిధానాన్ని మార్చినప్పుడే ఇది ఉపయోగపడుతుంది కాని లేకపోతే గుమాస్తాలను తయారు చేయటానికే ఉపయోగిస్తుంది. ఇదిమాత్రం దేశానికి మరేవిధంగానూ ఉపయోగపడదని మనవిచేస్తూ నేను విరమిస్తున్నాను.

శ్రీ ఇ. అయ్యపురెడ్డి: అధ్యక్షా, ఈతీర్మానం గురించి శిఫార్సు చేయవలసిన అవకాశం లేకపోయినప్పటికినీ, ఈవిషయాన్ని గురించి చర్చించే అవకాశమాత్రం ఉన్నది ఫ్రీఎడ్యుకేషన్ ఇవ్వాలనేది మనరాజ్యాంగచట్టంలోనే ఒక డైరెక్టివ్ ప్రిన్సిపల్ గావున్నది దానినిగురించి ప్రత్యేకంగా ప్రభుత్వానికి శిఫార్సుచేయవలసినఅగత్యం ఏమీలేదు అయితే, ఈనాడు విశ్వవిద్యాలయాలలోగాని, టెక్నికల్ కాలేజీలలోగాని, అడ్మిషన్సు జరిపేటప్పుడు మన ప్రభుత్వం ఒక క్రొత్తపందాను అవలంబించవలసి వుంటుందని విజ్ఞప్తిచేస్తున్నాను మొన్నటిరోజున ఒకప్రశ్న వేస్తే, మెడికల్ కాలేజీలలోనూ ఇంజనీరింగు కాలేజిలలోను ఎడ్మిట్ చేసుకోడానికి కొన్ని రూల్సువున్నాయి, వాటిప్రకారం జరుగుతాయి అన్నారు ఇంటర్వ్యూలలో మార్కులు ఇస్తారు సెలెక్టు చేస్తారు అనికూడా చెప్పినారు కాని, అట్లా చెయడంలో చాలా కష్టాలున్నాయి. ఒక ఉదాహరణ చెబుతున్నాను ఒక నాన్ గజిటెడ్ ఆఫీసరు కొడుకు వుంటాడు అతనికి 300 మార్కులు వచ్చివుంటాయనుకోండి గజిటెడ్ ఆఫీసర్ కొడుకో, హైకోర్టు జడ్జి కొడుకో వుంటాడు. అతనికి 316 మార్కులు వచ్చియుంటాయనుకోండి ఇటువంటి పరిస్థితులలో ఎన్ జి ఒ కొడుకుకు సీటు ఇవ్వడం అత్యావసరం ఆ పెద్ద ఆఫీసరుగారికొడుకుకి ఇక్కడ సీటురాకపోతే ఇంకొక కాలేజీలో దొరుకుతుంది అక్కడకుపోయి చదువుకోగలడు. లేకపోతే, ఫారిన్ వెళ్ళికూడా చదవాలంటే చదవగలడు. తండ్రి డబ్బుగలవాడు కనుక ఎక్కడికైనా పంపి చదివించగలడు కాని పేదవానికి ఇక్కడ సీటు రాకపోతే ఇక అతనికి వేరుమార్గంలేదు జీవితమే అంధకారబంధురం అయిపోతుంది చదవకపోతే జీవనోపాధేలేదు. ఇతర కాలేజీలకుపంపి చదివించగలశక్తి వుండదు నాన్ గజిటెడ్ ఆఫీసరుకు. ఇప్పుడు మనం అనుసరిస్తున్న విధానంవల్ల అలాంటి విచక్షణలేదు. దీనివల్ల, బాగా సదుపాయాలుండి, ఇతరత్రా జీవనోపాధి గడుపుకోడానికి వీలుండి, లేక వేరే ఉద్యోగం సంపాదించుకోడానికి వీలుంటున్న వారికే సీటురావడం, అత్యావశ్యకమైనవాడికి, ఇక్కడసీటువస్తేనే గాని, గత్యంతరం లేనివాడికి సీటురాకుండాపోవడం జరుగుతున్నది. ఇటువంటి విషయాలు చాలావున్నాయి. నేను ప్రత్యక్షంగాచూచాను 4, 5 మార్కులు రాలేదనో మొత్తంలో 7, 8 మార్కులురాలేదనో మధ్యతరగతికి, క్రిందితరగతికి చెందిన కొంతమంది విద్యార్థులకు సీటులు రాకపోవడంజరిగింది. మాజీవితమంతా అంధకార బంధురమైపోయింది జీవితమంతా ట్రాజిడీ అయిపోయిందని వారు నిస్పృహతో కృంగిపోయినారు టెక్నికల్ కాలేజీలలో అడ్మిషన్సు ఇచ్చేటప్పుడు ఇప్పటినుంచైనా బీదతనమునకు ప్రిఫరెన్సు ఇవ్వాలని కోరుతున్నాను వారు ఏ కులానికి చెందినప్పటికీ, ఆ కుటుంబంయొక్క ఆస్థియెంత, ఎంతఆదాయం వస్తుందిఅనేది గమనించవలసివుంటుందని నేను ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను

మిస్టర్ స్పీకర్: చాలామంది సభ్యులు మాట్లాడవలెనని అనుకుంటున్నారు మీరు చెప్పినప్రకారముగా చేస్తే 4గంటలకాలము ఈసభలో కూర్చోవలసివుంటుంది. అందుచేత దయచేసి తొందరగా సభనువాయిదావేయడానికి నాకు అవకాశము ఇవ్వవలెనని కోరుచున్నాను.

శ్రీ కె. వెంకటరావు: ఈ తీర్మానముమీద ప్రభుత్వమునకు కావలసినంత సానుభూతివున్నది కాని సభ్యులు చెప్పినంత సులభముగా దీనిని అమలు పరచడానికి వీలులేదు ఇప్పుడే నేను files చూచినాను. పాఠశాలలలో ఉచితవిద్యా సౌకర్యపు schemeను ప్రవేశపెట్టి experiment చేసినట్లయితే 5 లక్షల 45 వేల రూపాయలు ప్రభుత్వమునకు ఖర్చుఅవుతుంది దేశములో ఎన్నో schools వున్నవి. ఈ schools అన్నింటిలో ఈ scheme ను అమలులో పెట్టినట్లయితే 60 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది. మనకువచ్చిన బడ్జెటు అంతా education facilities యివ్వడానికే సరిపోతుంది అందుచేత తీర్మానములో "that necessary steps be taken as early as possible"అన్న పదజాలములోఈతీర్మానముయొక్క భారం అంతాపోయినది అందువలన దానిని accept చేయడములో ఏమియునష్టములేదు మనరాజ్యాంగము దేశములో అందరిని విద్యావంతులుగా చేయవలెనని ఆదేశిస్తున్నది ఆవిధముగా చేస్తేనే Democracy survive అవుతుంది. మనదేశములో ఉన్నటువంటి ప్రజాస్వామ్యము రక్షింపబడవలెనంటే దేశము విద్యావంతమైనది కావాలి ఆవిధముగా ఒక్క విద్యనే దృష్టిలోనుంచుకొని యితరకార్యక్రమాలను ఆపుచేయడము సాధ్యముకాదు ముఖ్యముగా మానవులు survive కావాలంటే ఆహారముకావాలి. ఆసమస్య ముందు పరిష్కరించవలసివున్నది .దానికి కొన్ని కోట్ల రూపాయలుఖర్చు పెట్టవలసి వున్నది శాసనసభ ప్రభుత్వముయొక్క budget ను ఆమోదిస్తుంది ఈపనులన్నిమానుకొని budget ను ఒక్క విద్యకొరకే ఎందుకు కేటాయించలేదు? శాసనసభవారే పంచవర్ష ప్రణాళికలు ఆమోదించినారు రెండవపంచవర్ష ప్రణాళిక అమలులోనికివచ్చి అప్పుడే 2½ సంవత్సరములు కావచ్చుచున్నది ఇంకా 2½ సంవత్సరములు దీనిక్రింద ఖర్చు పెట్టవలసి వున్నది. Education పద్దుక్రిందే యీడబ్బంతా కేటాయిస్తే ప్రణాళిక అమలులోనికిరాదు. "Every man and woman should be educated" అని Constitution లోనే వున్నప్పుడు దానినే పునరుద్ఘాటిస్తూ యీ శాసనసభ ఆమోదానికి పంపే ఆవశ్యకత యిప్పుడులేదు అయినప్పటికిని ప్రభుత్వము యీవిషయములో చాలాశ్రద్ధవహిస్తున్నది 10 సంవత్సరముల కన్న యిప్పుడు విద్యారంగములో మనమెంతో పురోభివృద్ధిని చూచినాము బీదవిద్యార్థులకు Scholarships మొదలైనవన్నీ కూడా యిప్పుడు ఎక్కువగా యివ్వడము జరుగుతున్నది III Form వరకు ఉచిత విద్య గరపాలని ప్రభుత్వము నిర్ణయించినది. అయితే గ్రామాలలో ఆ III Form వరకుకూడ బీదప్రజలు తమ

పిల్లలను ఎడులకు పంపుట చాలాకష్టము Compulsory education scheme ను ప్రవేశ పెట్టినప్పటికి ప్రయోజనము లేకపోయినది చదువుకోవాలనే అభిలాష వారిలోకూడ లేకకాదు బీదప్రజానీకము చిన్నప్పటినుంచే తమ పిల్లలను కూలి నాలి వృత్తులకు పంపించి వారు తెచ్చిన స్వల్ప ఆదాయమునుకూడ తమ కుటుంబ పోషణకు ఉపయోగించుచున్నారు అందుచేత ప్రజల జీవనస్థాయిలో కొంత improvement వచ్చే వరకు దేశములో అందరిని విద్యావంతులుగా చేయలేము ఇదంతా slow process లో జరుగవలెనేగాని overmighty reform చేయాలంటే కాదు అయితే శ్రీ నరసింహామూర్తిగారి మనసులో యింకొక point ఉండి వుండవచ్చును అది, Scholarships యింకా ఎక్కువ liberal గా యిచ్చి ప్రోత్సహించవలెనని వారి ఉద్దేశ్యమయితే కావచ్చును ఇంకా యీ concessian అందరికి యివ్వవలెనన్న అభిలాష కూడ వారిలో వుండవచ్చును అది వేరే సమస్య

శ్రీ జి నరసింహామూర్తి అధ్యక్షా! బీదవారందరికి కులముతో ప్రమేయములేకుండా ఈ concession యివ్వవలెనని నేను కోరుచున్నాను

శ్రీ కె వెంకటరావు వారు చెప్పినది అర్థమయినది బీదవారికి భాగ్యవంతులకు గీటు పెట్టడము చాలా సులభము మన దేశములో ఒకప్రక్క, అంతా బీదతనమే అనుకుంటున్నాము నేను కాలేజీలో చదువుకున్న రోజులలో రూ 14 లు జీతము వుండేది ఇప్పుడు B A చదువుకుంటున్నవారి సిగరెట్లకే ఆ డబ్బు చాలదు ఈ cost అంతా చదువు పద్దుకిందకే వస్తుంది మరి వాళ్లందరిని బీదవారుగానే పరిగణించవలెనా? Interruption by (Srimati T Lakshmikanthamma) నేను యీ తీర్మానాన్ని గురించే మాట్లాడుతున్నాను ఇంకేవిధముగా చేయాలన్న విషయమును గురించి నేను మాట్లాడలేదు ఇంకేమి చెయాలన్న విషయమై ప్రభుత్వము శ్రద్ధగా పరిశీలిస్తున్నది ఇప్పుడు ఆంధ్రలో ఏయే educational concessions వున్నవో అవన్నీ తెలంగాణా ప్రాంతానికి వర్తింపజేయడానికి ప్రయత్నము చేస్తున్నాము III Form వరకు free education యివ్వవలెనని Chief Minister గారు కూడ సూచించినారు ఈ తీర్మానములో బీదవారందరు అన్న మాటకు అర్థములేదు అయినప్పటికి బీదవిద్యార్థులు చదువుకొనడానికి కొంత aptitude చూపించితే వారికి చాలా concessions యిస్తున్నారు ఈ facilities యింకా అధికము చెయమని ప్రభుత్వమును అర్థించవచ్చును Concessions అందరి బీదవారికి extend చేయమని కోరడము చాలా అసమంజసముగా వున్నదని మనవిచేస్తున్నాను ఈ ప్రభుత్వమే కాదు, పరిపాలన మన సోదరుల చేతిలో వున్నను gradual గా జరుగ వలసినదే గాని ఒక్కసారిగాకాదు

శ్రీ జి. నరసింహమూర్తి :- వీలయినంతవరకు అని ఆమోదిస్తే బాగుంటుంది.

శ్రీ కె. వెంకటరావు :- వీలయినంతవరకు అని దీనిలోనే వున్నది. అది కాగితముమీద మాత్రమే వుంటుంది. రికార్డులోనికి వెళ్ళడానికి ఉపయోగిస్తుంది. ఇప్పుడు హరిజనులు, backward classes యింక ఇతర జాతులలో వున్న బీదవారు యీ concessions అనుభవిస్తున్నారు. ఈ facilities యింకా ఎక్కువ చేయమని అంటే దానికి limited గా యీ తీర్మానాన్ని అంగీకరించడానికి అభ్యంతరములేదు. కాని "all people" అన్నముక్క "as early as possible" అని వున్నప్పటికిని Government accept చేస్తే, assurance ఇచ్చినట్లవుతుంది. ఈమధ్యనే Assurances Committee అని ఒక కమిటీని వేసినారు. శాసనసభలోను ఇతరత్రా మంత్రులు చేస్తున్న వాగ్దానాలను అమలులో పెట్టుతున్నారా, లేదా అని పరీక్షించడానికి వారు నియమింపబడినారు. ఏదైన వాగ్దానముచేసి దానిని అమలుపరచక పోతే యీ కమిటీవారు enquiry చేయడము, యీ విషయమంతా శాసనసభలో discussion చేయడము, పత్రికలవారు దీనిని ప్రముఖముగా ప్రచురించడము మొదలగునవన్నీ జరుగును. అందుచేత దీనిని కొంత సంకుచితమైన field లో principle క్రింద నేను అంగీకరించలేకుండా వున్నాను. మీ అందరియొక్క సహకారముతో యీ తీర్మానము ప్రభుత్వము వ్యతిరేకిస్తున్నదని మనవిచేస్తున్నాను. నేను యిచ్చిన పై explanation ను దృష్టిలో పెట్టుకొని నరసింహమూర్తిగారిని ఈ తీర్మానము withdraw చేసుకొనవలసినదిగా కోరుచున్నాను.

శ్రీ జి. నరసింహమూర్తి :- అధ్యక్షా! మంత్రిగారు చెప్పినదంతా అవగాహన చేసుకున్నాను. కాని సాధ్యమయినంత త్వరలో చర్యలు తీసుకొనవలెనని మాత్రము తీర్మానము కోరుచున్నది. తక్షణమే యీ ఉత్తరక్షణలోనే అని మేము యీ తీర్మానము ప్రవేశపెట్టుటలేదు.

శ్రీ కె. వెంకటరావు :- దీనిని principle గా accept చేయడానికి ప్రభుత్వము అంగీకరించదని మనవి చేశాను. మన plan కూడ ఒప్పుకోదు. ఈ planలో స్తుందో లేదో నాకు నమ్మకము లేదు. వచ్చే ప్రణాళికలో కూడ యింత ఖరీదుగల ర్మానమును అమలుపెట్టడం సాధ్యముకాదు. Budget పద్దు ప్రవేశపెట్టిననాడే ష్ట్ర ఆదాయమంతా education కే వుపయోగించవలెనని తీర్మానము ఆనాడు ప్రవేశపెట్టివుంటే బాగుండును. అందుచేత ఈ విద్యా విషయములలో ప్రభుత్వము ఇప్పు న్న సౌకర్యములు ఎక్కువ చేయడానికి యత్నము చేస్తుందని మరొకసారి విజ్ఞప్తి స్తున్నాను.

శ్రీ జి. నరసింహమూర్తి - అధ్యక్షా! మంత్రిగారు తమ జవాబులో చాలావరకు తీర్మానానికి అనుకూలంగానే మాట్లాడినారు సాధ్యమైనంత త్వరలో చర్యలు తీసుకోవాలని మాత్రమే తీర్మానం కోరుచున్నది తక్షణం చర్యలు తీసుకోవాలని దానిలో లేదు

శ్రీ కె. వెంకటరావు - Immediate అంటే అర్థమదే కదా!

శ్రీ కె సీతయ్యగుప్త (ముషీరాబాద్) ఈ తీర్మానంమీద చాలామంది సభ్యులు మాట్లాడాలని పేర్లు ఇచ్చినారు కాని మంత్రిగారు ఈతీర్మానాన్ని అంగీకరిస్తారనే ఉద్దేశంతో వారు మాట్లాడలేదు కాబట్టి immediate అనే పదాన్ని తీసివేసి అయినా అంగీకరించమని మంత్రిగారిని కోరుచున్నాను

శ్రీ కె. వెంకటరావు ఈ తీర్మానాన్ని అంగీకరించదలచుకోలేదు

శ్రీ పె. గోపాలురెడ్డి (తిరుత్తని - జనరల్) ఆంధ్రరాష్ట్రం ఏర్పడక ముందు మంగలివారు నాయీబ్రాహ్మణులని నావిద అని వాడుకొంటూ ఉండేవారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత నాయీబ్రాహ్మణ అని మాత్రమే వాడుతున్నారు. అందువల్ల నావిద అని వాడుకుంటున్నవారందరికి ఈ concessions లేకుండా పోయినవి ఈ విషయం గురించి గత సంవత్సరం ప్రభుత్వానికి తెలుపుకున్నా ఇంతవరకు మోక్షం లేకుండా పోయింది

శ్రీ జి నరసింహమూర్తి: తీర్మానం నెగ్గడమా ఓడడమా, అన్నది నా సమస్యకాదు హరిజన, వెనుకబడిన జాతులతోపాటు ఇతర కులాలలోని బీద విద్యార్థులకు కూడా ఈ సౌకర్యాలను అనువర్తించుటకు ప్రయత్నించాలని మాత్రమే కోరుతున్నాను అవసరమైన దీనిని కొంత సవరించవచ్చును

మిస్టర్ ఛైర్మన్ మంత్రిగారి ఉపన్యాసమును విన్నారు ఇప్పుడు మీరు మీ తీర్మానాన్ని ఓటుకు పెట్టమంటారా లేక ఉపసంహరించుకుంటారా ? ఆ విషయం మాత్రం చెప్పండి సవరణ ఏమీరాలేదు, తీర్మానం ఉన్నది ఉన్నట్లుగానే ఉన్నది. ఇప్పుడు amendment ఇచ్చుటకు గాని, వాటిని accept చేయుటకుగాని వీలులేదు

శ్రీ జి నరసింహమూర్తి మంత్రిగారు తీర్మానానికి సుముఖులమని సెలవిచ్చారు గాన నా తీర్మానాన్ని ఉపసంహరించుకుంటున్నాను

The resolution was, by leave of the House, withdrawn

## *Official Language of the State*

*Sri Vavilala Gopalakrishnayya* Sir, I move

"This Assembly recommends to the Government to introduce forthwith Legislation making 'Telugu' the official language of the

State also providing for its extension to all Departments of Government in convenient stages with due safeguards for the protection of Urdu and take all necessary steps for its proper implementation "

*Mr Chairman* Motion moved

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, "తెలుగు భాషను రాష్ట్రం యొక్క అధికార భాషగా చేయుచూ సౌకర్యంకోసం అనువగు రీతిని ప్రభుత్వశాఖల అన్నింటికి దానిని విస్తరింపచేయుటకు నిర్దేశించుచు, అందుతోపాటు ఉర్దూభాషకు ఇవ్వవలసిఉన్న రక్షణలను కల్పిస్తూ వెంటనే చట్టమును ప్రవేశపెట్టి శీఘ్రంగా అమలు జరుపుటకు సకల చర్యలు తీసుకోవలసిందని ఈ విధానసభ ప్రభుత్వానికి సిఫార్సు చేయుచున్నారు " అనే తీర్మానాన్ని నేను ఉపపాదిస్తున్నాను

మనం ఎంతో కృషిచేసి దేశ స్వాతంత్ర్యాన్ని సాధించడమేగాక, భాషా ప్రయుక్త రాష్ట్రాలను సాధించాము సమగ్రమైన విశాలాంధ్ర ఏర్పడినది ప్రభుత్వ వ్యవహారాలను ప్రాంతీయ భాషలలో నడుపుకోవాలనే ఆశయంతోనే మనమా ఉద్యమాన్ని ప్రారంభించాము ప్రజలు తమ భాషలో మాట్లాడినప్పుడే తమ తమ అభిప్రాయాలను స్వచ్ఛంగా చెప్పుకోగలరని అందువల్ల అది రాచరిక భాష ఐనప్పుడే మనం కోరే ఆశయం సఫలీకృతమౌతుందని కొండా వెంకటప్పయ్య పంతులుగారు ఆ ఉద్యమాన్ని ప్రారంభించినప్పుడే చెప్పారు ప్రజాస్వామ్యంలో ప్రజలు, ప్రభుత్వానికి తమ అభిప్రాయాలను మధ్య మనుషుల అవసరం లేకుండా అందచేయగలగాలి. అప్పుడే అది ప్రజాస్వామిక ప్రభుత్వమౌతుంది ఇదే ప్రాతిపదికమీద నేడు భారతదేశమంతా ఒక్క బొంబాయి తప్ప, భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడినవి అందువల్ల రాష్ట్రాని కా రాష్ట్ర ప్రాంతీయభాషలో వ్యవహారాలనునడిపించాలి ఐతే ఇక్కడ ఉర్దూభాషకూడ కొంత ప్రధానంగా ఉన్నది కనుక దానిని కూడ ప్రాంతీయ భాషగా సమన్వయపరచే పద్ధతి దీనిలో పొందుపరచబడినది ఇక పోతే తెలుగుభాష రాచరికభాషగా పనికివస్తుందా ? అనే విషయంలో మనలో భిన్నాభిప్రాయం ఉండవచ్చును గాని ఈ మధ్య హోల్డు అనే పెద్ద శాస్త్రవేత్త హిందూలో ఒక వ్యాసం వ్రాస్తూ బహుశ భారతదేశంలో ఉన్న భాషల అన్నింటిలోకి సైన్సుకుగాని, పారిభాషిక-శబ్దార్థంగా గాని తెలుగుభాషకు ఉన్నంత నుడికారం, సౌమనస్యం మరొక భాషకు లేదని వెల్లిబుచ్చారు ఆయన ప్రాంతీయ అభిమాన, దురభిమానాలతో సంబంధంలేని వ్యక్తి ఆయన ఇంగ్లాండు దేశీయుడు పైగా ఆయన సామాన్య భాషతో సంబంధించిన మనిషి గాడు ఆయన ఒక పెద్ద శాస్త్రజ్ఞుడు దీనినిబట్టి మన భాష నిజస్వరూపం గ్రాహ్యం చేసుకోవచ్చు

అందువల్ల తెలుగు భాషను అధికార భాషగా నిర్ణయించినచో భాషను సాధ్యమైనంతవరకు సౌలభ్యంలోకి తీసుకువచ్చుట కొరకు కావలసిన పద జాలములను, technical terms ను ఆ ప్రయోగ నిర్మాణమును, వాటికి కావలసిన పనిముట్లు, టైపు

వైఖర్యు వ్యవహారాలను శీఘ్రంగా చేసుకోగలము అప్పుడే శాసనాలను వ్రాయడం, వాటిని సమన్వయం చేసుకోవడం సాధ్యమౌతుంది వీటిని సాధించిన తరువాత పరిష్కృతమైన రాజకీయ భాషగా చేసుకోగలిగామని చెప్పుకోగలము

ఈమధ్య A I C C గౌహతిలో సమావేశమైనప్పుడు ఏ రాష్ట్రాన్ని కా రాష్ట్రం తన ప్రాంతీయ భాషలను ప్రభుత్వ భాషగా చేసుకోవడం ఉత్తమమని ఒక తీర్మానమును పాస్ చేసి రాష్ట్రాలన్నీ ఆవిధంగా చెయ్యాలని ఒక డైరెక్టివ్ ఇచ్చారు. ఆ విషయాన్ని నేను చదివాను దానిలోని అన్వయాలలో తేడాలున్నచో నాకేమీ బాధ్యత లేదనుకుంటాను మేము ఆ ప్రకారంగా అర్థం చేసుకున్నాము

తెలంగాణలో తెలుగు భాష వాడుక, ఏవిధంగా ఉన్నది అని తెలుసుకొనుటకు ఇంతకుముందే రాములుగారు మాట్లాడినారు ఆయన మాట్లాడిన భాషలో ఉర్దూ పదాలుగాని, ఇంగ్లీషు పదాలు గాని కలియక ఎంతో తీయదనం, స్వంత నుడికారంతో తిక్కన్న గారి అచ్చ తెలుగువలె కనబడినది ఆ భాషను వింటున్నంతసేపు ఈ భాష అధికార భాషగా ఎప్పుడు నిర్ణయమౌతుందా? అని అనిపించినది ఐతే నిఘంటు త్రయంలోని పదాలే ఉండాలని నా అభిమతం కాదు. రేడియో, రైల్వేస్టేషన్ మొదలైన పదాలకు బదులు ఆరు మైళ్ళ పొడవు పదాలను సమన్వయించుకొనే బదులు ఇదమిద్ధంగా వాటినే వాడవచ్చును 20th Century Dictionary లో 'కూలీ' అనే పదమును ఇంగ్లీషు భాషగా వాడారు. దానిని 50 అన్వయాలు చేసేబదులు అదే సులభ గ్రాహ్యంగా ఉన్నది

శాసనసభాధ్యక్షులు మూడు కమిటీలను వేశారు ఆకమిటీలు చాలావరకు ప్రయత్నాలు చేశాయి రిపోర్టు తయారైనది.

శ్రీ కె వెంకటరావు Absentee member కు 'అనుపస్థితి సభ్యుడు' అని తెనిగించినట్లు విన్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య నేను చెప్పలేదండి వెంకట్రావుగారు స్వంతభాషలో అన్వయించుటకు ప్రయత్నం చేస్తున్నారు నేనుకూడ సమన్వయిస్తుందో లేదో చూచి బాగుగా ఉన్నదో అంగీకరిస్తాను లేనిచో వెంకట్రావుగారి, మీగౌరవంతో, ఆమాటను త్రోసివేస్తాను

ఆమూడు కమిటీలు మూడుభాషలలో మాత్రమే తయారుచేసినట్లు తెలుస్తున్నది. తెలుగుభాషను అధికారభాషగా చేయుటలో ఎంత ఆలస్యం ఔతుందో అంతనష్టం సంప్రాప్తమౌతుందని మనవి చేయుచున్నాను హిందీభాషా సమస్య వేరు అది భారత దేశంమొత్తానికి సంబంధించినది అధికారభాషగా నిర్ణయంచేసినప్పుడే ఏ భాషకైనను పరిపూర్ణత సిద్ధిస్తుంది అందుచేతనే భాషా సమగ్రతకు సకల చర్యలు తీసుకోవాలని యిందులో ఉట్టంకించబడినది ఇది అంతా ప్రభుత్వమే చేయాలి రూల్సును తెలుగులోకి మార్చవచ్చునా, లేదా? అనే సమస్య వచ్చింది. మనమందరం తెలుగులోనే

మాట్లాడుతున్నాము కాని తెలుగులో మాట్లాడకూడదు. Constitution లో ఒక అడ్డంకు ఉన్నది

శ్రీ కె వెంకటరావు ఈవేళ ఎలాగు పూర్తికాదు ఈసారి మరల అంతా కలిసి మాట్లాడవలసి ఉంటుంది

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అలాగేనండి

*Mr Chairman* I now adjourn the House *sine die*

The House then adjourned *sine die*

---